# ఆంధ్ర ప్రదేశ్



సమాచార, పౌరసంబంధముల శాఖ ; ఆంధ్ర ప్రదేశ్

Registered No. H-373

సంపుటి 3 | మార్చి, 1959 — చైత్రము, శాలివాహనశకము-1880 | సంచిక 5

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడినది.



బాలలకళ : ప్రదర్శన మైదానంలో బాల కళాకారులతో మాట్లాడుతున్న ముఖ్యమంత్రి.



నాగార్జున కొండవద్ద నిర్మాణం కాగల పురావస్తు ప్రదర్శనశాఖకు క్రింద మంత్రి శ్రీ హుమాయూన్ కబీరు శంకుస్థాపన చేశారు ఇక్కడాయన ఒక నమూనాను పరిశీలిస్తున్నారు



# ఆంధ్రప్రదేశ్

మార్చి, 1959.

సంపుటి 3 సంచిక 5

చైత్రము, శాలివాహనశకము-1881

## విషయసూచిక

| | | |
|---|---|---|
| నాగార్జునసాగర్ ప్రాజెక్టు ప్రగతి | ... | 1 |
| రాష్ట్ర బడ్జెట్టు | ... | 10 |
| జిల్లాల వార్తలు | ... | 13 |
| ఆనందబాష్పాలు | ... | 20 |
| పశ్చిమ గోదావరి జిల్లా ప్రగతి | ... | 23 |
| పోలీసు గ్రామం | ... | 26 |
| గుంటూరు ప్రభుత్వ జనరల్ ఆస్పత్రి | ... | 28 |
| చిత్తూరు జిల్లా | ... | 31 |
| నిజామాబాదులో సమాజాభివృద్ధి | ... | 43 |
| ప్రజా సహకారం | ... | 49 |
| అభిప్రాయ వేదిక | ... | 50 |
| మంత్రివర్గ తీర్మానాలు | ... | 51 |

## ముఖచిత్రం

20-2-59 న రాష్ట్ర శాసనసభలో 1959-60 బడ్జెట్టును సమర్పిస్తున్న ఆర్థిక శాఖామంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి.

— చందా వివరాలు —

సంవత్సరానికి 2 రూపాయల 16 నయాపైసలు

విడిప్రతి వెల 18 నయాపైసలు

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి

సిటిజన్ ప్రెస్‌లో ముద్రింపబడినది.

# నాగార్జునసాగర్ ప్రాజెక్టు ప్రగతి

ఎండనక, దుమ్మనక, గాలనక వేలకొలది కార్మికులు ఆనకట్టకు, రెండు కాలవలకి సంబంధించిన త్రవ్వకం మున్నగు పనులను నిర్విరామంగా కొనసాగిస్తూ వుంటారు. ఇదే నేడు నాగార్జునసాగర్‌ని దర్శించే ప్రేక్షకుల మనస్సులో హత్తుకుపోయే మహత్తరదృశ్యం. ప్రతినెలా యీ ఆనకట్టను 5000 మందికిపైగా దర్శిస్తున్నారు.

ప్రేక్షకుల సౌకర్యానికై యిటీవల 30గదులుగల ప్రాజెక్టుసదనం నిర్మించబడింది. కాని ప్రేక్షకులలో అధికసంఖ్యాకులు రాత్రిళ్లు అక్కడ వుండరు. పగలే నిర్మాణస్థలాలు, కాలనీలు, నమూనా ప్రాజెక్టు, పనులు, కష్టసాధ్యమయిన కొండప్రాంతంలో చాతుర్యంతో నిర్మించబడిన రోడ్లు తుదకు గంభీరసుందరమయిన నదిని దర్శిస్తారు. అయితే రాత్రులువుండే వారికిమాత్రం కొత్తవిజయపురి దీపాలు, చక్కని పథకం ప్రకారం నిర్మింపబడి పక్కనగల కాలనీల దీపాలు కన్నుల పండువుచేస్తాయి.

ఇప్పుడు యీ ప్రాజెక్టుకి సంబంధించిన అత్యద్భుతవిషయమేమిటంటే, అక్కడ యింతకుముందెన్నడూ యెరుగనంత అధికసంఖ్యలో కార్మికులుపాల్గొనుట. వేర్వేరు ప్రాంతాలకుచెంది వేర్వేరు భాషలను మాట్లాడుతూ, ఆఖరికి వస్త్రధారణలో కూడా వత్యాసాలుగల మనుషులందరూ వుత్సాహంతో పని చేస్తూ— ప్రేక్షకులకు కూడా వుత్సాహం కలిగిస్తారు. ఈప్రాజెక్టు యే మహాస్వప్నానికి ప్రాతినిధ్యం వహిస్తున్నదో ఆ మహాస్వప్నం మౌనప్రభా



ఎడమ కాలువపని జరుగుతున్నది,



కుడి కాలువ పని జరుగుతున్నది

వమే అదంతా—ఆకల భూమాత వేలాదిపేదపిల్లల శ్రీమతో చెమటతో క్రమేపీ నిజమవుతున్నది.

యంత్రాలపని యీ మనుషులకు తోడ్పడులే-కాని అధికాయకష్టంతో సాధ్యంకాని ముఖ్యమయిన పెద్దపనులకే వుపయోగింప బడతాయి. ఆనకట్టవద్ద యింతవరకూ చక్కని అభివృద్ధిని సాధించినకీర్తి కార్మికులకు, యెంతోశ్రద్ధతో అక్కడపని చేస్తున్న యువ ఇంజనీర్లకి దక్కుతుంది. ఇంచుమించు ఒక వేయిమంది తాపీపనివారు ఆనకట్టను నిర్మిస్తున్నారు; ఇక్కడ రాతికట్టడం పనియిదివరకు యెక్కడా జరగనంత యెక్కువగా జరిగింది 7-2-59న ఆనకట్టమీద రోజువారీ రాతికట్టడంపని 1 లక్ష 19 వేల ఘ. అ పరిమాణానికి చేరింది. ఆ రోజున కేంద్రనీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖామంత్రి శ్రీ హాఫీజ్ మహమ్మద్ ఇబ్రహీం ఒకరాతిని పేర్చుటద్వారా నిర్మాణంలో చిహ్నప్రాయంగా పాల్గొన్నారు. రెండు కాలువలకు సంబంధించిన పనికూడా అలాగే పురోగమిస్తున్నది. ఆరోజున కేంద్రమంత్రి యెడమ కాలువపై హాలియా అక్విడక్టుకి శంకుస్థాపనకూడా చేశారు నాగార్జునసాగర్ ప్రాజెక్టు పని ఇప్పటిస్థాయిలో కొనసాగుటకు సాధ్యమయిన సహాయాన్నంతా కేంద్రప్రభుత్వం చేయగలదనీ, ప్రాజెక్టు అవసరాలను మిక్కిలి సానుభూతితో పరికించ గలదనీ ఆసందర్భంలో మాట్లాడుతూ ఆయన అన్నారు. చేపట్టబడిన అభివృద్ధి పనులన్నిటిని ప్రజలు తమవిగా భావించి పూర్తిసహకారమివ్వాలని నొక్కిచెప్పారు.

ఆసందర్భంలో రాష్ట్రనీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖామంత్రికూడా ప్రసంగించారు. ద్వితీయ ప్రణాళికలో నాగార్జునసాగర్ ప్రాజెక్టుకి జరిగిన కేటాయింపు మిక్కిలి తక్కువ అనినొక్కిచెబుతూ పనిని ప్రస్తుత స్థాయిలో కొనసాగించి అనుకున్న ప్రకారం 1963-64 నాటికి ప్రాజెక్టునుపూర్తి చేయుటకు ద్వితీయప్రణాళిక కాలంలో ప్రస్తుత కేటాయింపు కాక అదనంగా రూ 15కోట్లు కేటాయించబడాలని చెప్పారు పర్యటన సమయాలలో ప్రాజెక్టువిష



కేంద్ర నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖామంత్రి శ్రీ హాఫిజ మహమ్మద్ ఇబ్రహీం 7-2-1959 న
ఎడమ కాలువపై హాలియా అక్విడెక్టుకి శంకుస్థాపన చేశారు.



అనకట్ట స్థలంవద్ద

యంలో తామువిన్న విమర్శలను ప్రస్తావించి రెండవఘట్టం కేవలం కల అని ప్రజలు అన్నారన్నారు. ఇప్పటినుంచి యిందుకు సంబంధించిన అన్ని జిల్లాలకి చెందిన ప్రజలకు విశ్వాసం కలుగుటకై రూ 122 కోట్లమొత్తం ప్రాజెక్టుపనిఅంతా ఒకేటక యెడ తెగని ఘట్టంలో జరుపబడాలన్నారు.

ఇంతమంది మనుషులకు పనికల్పిస్తున్న ప్రాజెక్టు యిదొక్కటే నన్నారు. 30,000 మంది ఆనకట్టవద్ద, మరొక 40,000 మంది కాలువలవద్ద పనిచేస్తున్నారు. కార్మికుల సహకార సంఘాలు యేర్పడి పనిచేస్తున్నాయి. కుడికాలవ నిర్మాణంలో తేబడిన మార్పువల్ల 1 కోటి రూపాయలు మిగిలాయన్నారు.

హాలియా అక్విడెక్టు తెలంగాణాలో మిక్కిలి పెద్ద అక్విడెక్టు అని అంటూ పనిలో కొంతభాగమె పూర్తయిందనీ, యింకా యెంతో జరుగవలసి వున్నదనీ అక్కడ చేరినప్రజలకు చెప్పారు. చుట్టుపక్కల 20 లక్షల ఎకరాలకి సాగునీరు లభించినప్పుడే వారు తృప్తిపడాలన్నారు.

ఎడమకాలువకు రూ. 23.4 కోట్లు ఖర్చుకాగల పని అంతకుముందు మాట్లాడుతూ కాలువల చీఫ్ ఇంజనీరు శ్రీ జి. ఏ. నరసింహారావు అన్నారు. మొదటిఘట్టంలో దానిపొడవు 108 మైళ్లు వుంటుంది; దాని పంపిణీ కాలువల మొత్తం నిడివియే 2,000 మైళ్లో వుంటుంది. మొత్తంమీద కాలువ సిస్టం 7,000 మైళ్లు వుంటుంది. ఇదికాక 7,500 అ. పొడవు, 32 అ. వ్యాసంగల సొరంగం కాలువ వుంటుంది. కాలువల్కు, సొరంగం కాలువల త్రవ్వకం సందర్భంలో దేశంలోకల్లా యిదే మిక్కిలి పెద్దపని. కుడికాలవ పరిమాణం దీనికంటె 1 1/2 రెట్లు యెక్కువ వుంటుంది.

కార్మికుల నియామకం విషయంలో, గరిష్టం రోజుకి 22,000 వరకూ వుంటుందన్నారు. ఈ పని అనుకున్నప్రకారం పూర్తి కావాలంటే రోజుకి 30,000 మంది కార్మికులను నియమించాలన్నారు. పరిశోధన, డిజైనింగులపై యెక్కువ సిబ్బంది నియామకంద్వారా పొదుపు, సావర్థ్యముకూడా తగిన



కుడి కాలువపని—మరొక దృశ్యం.



నిర్మాణంలోనున్న ఆనకట్ట.



ఎడమ కాలువపని జరుగుతున్నది.



కార్మిక కాలనీ దృశ్యం.

మేరకు సాధించబడిన వన్నారు. సాధ్యమయినంత వరకూ స్థానిక కంట్రాక్టర్ల వినియోగంద్వారా కూడా పొదుపు సాధించ బడిందన్నారు. పనిలో కొంతభాగాన్ని చేపట్టుటకు భారత్ సేవక్ సమాజ్ ప్రోత్సహించ బడిందన్నారు.

వాలియం అక్విడెక్టు నిర్మాణంలో వుక్కు వినియోగింప బడిందని ఆయన వెల్లడించారు.

ప్రాజెక్టుపనిలో యెదురవుతున్న యిబ్బందులను గురించి మాట్లాడుతూ తగినంతడబ్బు అందుబాటులో లేదన్నారు. అవసరమయిన యంత్రాల దిగుమతికై విదేశమారకాన్ని విడుదల చేయమని కేంద్ర ప్రభుత్వాన్ని కోరారు. ఈప్రాజెక్టు, రూ 135 కోట్ల వ్యయంపై ఆఖరికి 35,00,000 యెకరాలకి నీటి పారుదల కలుగచేయుటకు, 4,00,000 కెలోవాట్ల విద్యుచ్ఛక్తిని వుత్పత్తిచేయుటకు వుద్దేశించబడింది. కాని యిప్పుడు పనిజరుగుతున్న మొదటిఘట్టంలో రూ 88 కోట్లపై యించుమించు 20 లక్షల ఎకరాలకి నీటిపారుదల లభిస్తుంది. పరిమాణం విషయంలో ఇండియాలో మిక్కిలి పెద్దదిగా వుండగల కుడికాలవ 1-1/4 మైళ్ల పొడుగున సొరంగంగుండా ప్రవహించవలసి వుంటుంది. ఎడమకాలవకూడా సొరంగాన్ని దాటాలి.

కొంతపని ప్రభుత్వపరంగా జరిగినా, యెక్కువ పని కంట్రాక్టర్ల క్రింద వుంది. కార్మిక సహకార సంఘాలకి కూడా కొంతపని యివ్వబడుతుంది. వాటికిచ్చేపని కంట్రాక్టువిలువలు రూ 25,000 వరకూ వుంటాయి. ఎడమకాలువపని కొంత భారత్ సేవక్ సమాజ్‌కి అప్పగించబడింది. క్రిందటియేడాది అది 2 మైళ్ళ పని పూర్తిచేసింది. ఈసీజన్‌లో మరొక మైలుకి దానికి కంట్రాక్టువుంది. దానికి స్వంతంగా



మనుషులకు తోడు నీడగా.



స్థిరమయిన పురోగమనం—ఎడమ కాలువ.

ఇంజనీర్లు, సూపర్‌వైజర్లు వున్నారు; క్రిందటి సంవత్సరం దానివిభాగంలో 800-1000 మంది పని చేశారు.

ఇప్పుడు ప్రాజెక్టు అన్ని విభాగాల్లోను పని శీఘ్రతరంగా కొనసాగుతున్నది. నిర్ణీత కాలంలో విశాలమయిన జలాశయం, పంపిణీ కాలువలతో కూడిన కాలువలు ప్రజలకు సౌభాగ్యానందాలు వెల్లివిరిసే నూతనశకాన్ని కొనిరాగలవని ఆశించ బడుతున్నది.





చురుగ్గా పని సాగుతున్నది—ఆనకట్ట స్థలంవద్ద.



దైనందిన కార్యక్రమం—ఆనకట్ట స్థలంవద్ద

(2)

# రాష్ట్ర బడ్జెట్టు

"దేశ భవిష్యత్తు, యీ రాష్ట్రభవిష్యత్తుకూడా నిరంతర జాగరూకతపైన, కష్టపడి పని చేయుటపైన, త్యాగంపైన పూర్తిగా ఆధారపడివుంటాయి. ఆంధ్రప్రదేశ్ ప్రజానీకం సర్వదా సందర్భోచితంగా వ్యవహరిస్తారనీ, జీవన ప్రమాణాలను హెచ్చించి, వాస్తవ మయిన శ్రేయోరాజ్య స్థాపనకై పునాదివేయుటకు దేశం జరిపే పోరాటంలో తమ శక్తివంచనలేకుండా కృషిచేస్తారనీ నాకు విశ్వాసంవుంది" అని 20-2.59 న రాష్ట్ర శాసనసభలో బడ్జెట్టుపై ప్రసంగిస్తూ ఆర్థికమంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి అన్నారు.

1956 నవంబరులో ఆంధ్రరాష్ట్రానికి తెలంగాణా జిల్లాలు 9 కలుపబడుటతో, యేకీకృతమయిన పరిపాలనా వ్యవస్థ యేర్పాటు, శాసనాలు, కార్యవిధానాలు మున్నగువాటి సమన్వయం, రెండు ప్రాంతాలలోను పన్నుల వ్యవస్థ రేషనలైజేషను, అన్నిటికిమించి పూర్వాంధ్ర, హైదరాబాదు రాష్ట్రాలనుంచి తీసుకోనబడిన సిబ్బందికి భద్రత కలదనే నమ్మకం కల్గించుటవంటి అనేక సమస్యలు వుత్పన్నమయినవన్నారు.

ఆయన యింకా యిలాఅన్నారు. "వీటిలో పెక్కు సమస్యలు సంతృప్తికరంగా పరిష్కరించబడ్డాయి. నాముందు ఆర్థికమంత్రి వాగ్దానం చేసినట్టుగానూ, కొత్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం యేర్పాటుకుముందు అనుకున్నట్లుగానూ ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలు రెండిటికి ఆయ వ్యయాల అంకెలను విడివిడిగా వుంచుటతప్ప, రెండుప్రాంతాల ఆర్థిక విషయాలు పూర్తిగా యేకీకృతం చేయబడినవి. అవసరమయిన యేకత్వాన్ని సాధించుటకై సందర్భోచితమయిన నిబంధనలు, కార్యవిధానాలు కూడా తగినట్లు సవరించ బడినవి. ప్రభుత్వ యితర శాఖలు కూడా తమ తమ పరిపాలనారంగాలలో ఒకేవిధమయిన శాసనాలను తయారుచేసి ప్రవేశపెట్టుటకై చురుగ్గాకృషి సలుపుతున్నాయి. హైదరాబాదు రాష్ట్రం నుంచి తీసుకున్న వుద్యోగులకు, వేతనపు స్కేళ్లు, సెలవు, పెన్షన్‌లవంటి వుద్యోగ నిబంధనల విషయంలో, రక్షణకు సంబంధించి కేంద్రప్రభుత్వం చేసిన సూచనలన్నింటిని రాష్ట్రప్రభుత్వం ఆమోదించి అమలుజరిపింది".

## ద్వితీయప్రణాళిక

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అభివృద్ధి 1956-57 లో బాగాదెబ్బతిన్నదనీ, 1957-58లో కూడా కొంతవరకూ దెబ్బతిన్నదనీ మంత్రిగారు అన్నారు. "అయితే జరిగే సంవత్సరంలో పరిస్థితి బాగాఅభివృద్ధి చెందింది; ప్రణాళికలో నిర్ణయించిన లక్ష్యాలు నెరవేర గలవని యిప్పుడుమనం నమ్మకంగాఅనుకోవచ్చు.

"గడచిన మూడు సంవత్సరాలలోను ప్రవేశపెట్టిన పన్నువిధింపు చర్యలవల్లనూ, రెండవ ఆర్థిక కమిషన్ అవార్డుక్రింద కేంద్రప్రభుత్వంచే రాజ్యాంగం 275 (1) సూత్రం క్రింద సంవత్సరానికి రూ 4 కోట్లచొప్పున యివ్వబడేగ్రాంటు యిన్‌యెయిడ్ తోనూ ఆదాయంలో వస్తూవుండేలోటు దాదాపు తుడిచిపెట్టుకు పోయింది; ఇప్పుడురాష్ట్ర ఆర్థిక పరిస్థితి మూడు సంవత్సరాలు క్రిందటకంటె యెంతో మెరుగ్గా వుంది;"

1957-59 లో రూ 62.33 కోట్ల ఆదాయం, రూ 55.11 కోట్ల వ్యయం కనబడింది. అంటే ఆసంవత్సరం పునర్విమర్శిత మయిన అంచనాలలో ఆశించినది రూ 3.12 కోట్లు కాగా రూ 7.22 కోట్లు మిగులు తేలినదన్నమాట.

1958-59 పునర్విమర్శిత మయిన అంచనాలలో ఆదాయం రూ 68.23కోట్లుగాను, వ్యయం రూ 64.79 కోట్లుగాను వున్నది. (1958-59 బడ్జెటుఅంచనాలు యివి: ఆదాయం రూ 63.66కోట్లు, వ్యయం రూ 62.87 కోట్లు). 1959-60 బడ్జెటు అంచనాల మొత్తం అదాయం రూ71.29 కోట్లుగాను, వ్యయం రూ 71.66 కోట్లుగాను వున్నది.

## పెట్టుబడిఖర్చు

1959-60లో పెట్టుబడి ఖర్చువసతి రూ28.30కోట్లు ఇందులో రూ 24.91 కోట్లు ప్రణాళికా పథకాలకు, మిగిలిన రూ 3.39 కోట్లు ప్రణాళిక పరిధి కావలనున్న ముఖ్యమయిన అంశాలకు వుద్దేశించ బడ్డాయి. కేటాయింపులో యెక్కువభాగం నీటిపారుదలకు, విద్యుచ్ఛక్తికి పోతుంది. వీటిమొత్తం కేటాయింపు 1958-59లో రూ 18.35 కోట్లనుంచి వచ్చేసంవత్సరం రూ 19.35 కోట్లకిహెచ్చింది. నాగార్జున సాగర్ నీటిపారుదల పాృజెక్టుకి రూ 7 కోట్లు కేటాయించబడ్డాయి.

1959-60 బడ్జెటు అంచనాలలో కేంద్రఋణం రూ 20.19 కోట్లు, వచ్చేసంవత్సరం చిన్నమొత్తాల పొదుపు, మార్కెటు అప్పుద్వారా రాగలవని భావిస్తున్న మరో రూ 10 కోట్లు లెఖ్ఖలోకి తీసుకోబడ్డాయి.

మంత్రిగారు ప్రణాళికా వ్యయాన్ని గురించి ప్రస్తావిస్తూ 1959-60 కి ప్లానింగు కమిషన్ రూ37.66 కోట్ల ప్రణాళికకు సమ్మతించినదనీ, యిందువల్ల ప్రణాళిక ఆఖరు సంవత్సరంలో ఖర్చుపెట్టుటకు యింకా రూ 47.61 కోట్లు మిగులగలవనీ అన్నారు. పృణాళికాలక్ష్యం రూ 175.74 కోట్లలో పృణాళిక అఖరు సంవత్సరమయిన 5 వ. సంవత్సరంలో మిగిలిన రూ 47.61 కోట్లను ఖర్చుపెట్టుట కష్టంకనుక ప్రభుత్వం 1959-60 కేటాయింపును రూ42.03 కోట్లకు హెచ్చించుటకు నిర్ణయించిందన్నారు.

ఆయన యింకా యిలా అన్నారు; "గడచిన మూడు సంవత్సరాలుగా సాలుసరి పృణాళికల వనరులకు రాష్ట్రవిరాళం యేఁటేటా హెచ్చుతుండగా, రాష్ట్రప్రణాళికలకు అప్పులు, గ్రాంటులుగా లభించే కేంద్రసహాయం యేడాదికి యించు మించురూ19-20 కోట్లవద్ద మార్పులేకుండా నిలిచిపోయినది. ప్రస్తుత అంచనాల పృకారం 1959-60 పృణాళికా వ్యయానికై యించు మించు రూ 15.92కోట్లను సంపాదించగలమని భావిస్తున్నాం; కేంద్రప్రభుత్వం రూ 19.00కోట్లను యివ్వగలదు. దీనికి 1-4-1959 నాటికి వుండగల ప్రారంభ యెఫెక్టివ్ రొఖ్ఖం నిల్వ రూ 3.50 కోట్లను కలుపు కోవాలి. ఈవిధంగా వచ్చేసంవత్సరం ప్రణాళిక మొత్తం వనరులు రూ 38-42 కోట్లు. యిది యిలా వుండగా బడ్జెటు 1959-60 లో ప్రణాళికకు రూ 42.03 కోట్లకి వసతి కల్పిస్తున్నది. ఈవిధంగా వచ్చేసంవత్సరం ప్రణాళికఖర్చు వనరులలో మొత్తం రూ 3.61 కోట్లు వెలితివుంది. ప్రయాణీకులు, సరుకులపై పన్ను విధింపు వ్యవస్థలో తలపెట్టిన మార్పులవల్ల వచ్చే రాబడితో యీవెలితి కొంత భర్తీచేయబడుతుంది. మార్పులకు సంబంధించినబిల్లు అప్పుడే శాసనసభలో ప్రవేశపెట్టబడింది. ఈచర్యవల్ల వచ్చేయేడాది యించు మించు రూ 75 లక్షలు రాగలవని భావించ బడుతున్నది. మిగిలినవెలితి తగిన యితర సాధనాల ద్వారా భర్తీచేయబడుతుంది."

## పృభుత్వ ఋణం

1959-60 లో ప్రభుత్వఋణం రూ 18.28 కోట్లు హెచ్చగలదనీ 1960 మార్చి నెలాఖరికి అది రూ 187.85 కోట్లు వుండగలదనీ భావించబడుతున్నదని ఆర్థికమంత్రి ప్రభుత్వఋణం విషయంగురించి మాట్లాడుతూ వెల్లడించారు. 1959-60 బడ్జెట్టులో ప్రభుత్వఋణంపై వడ్డీకి వసతికూడా రూ 6.06 కోట్లకి హెచ్చిందన్నారు. ఆయన యింకా యిలా అన్నారు. "ఆర్థిక వ్యవహారాలసంఘం సిఫార్సు చేసిన అప్పుల సమన్వయ పథకాన్ని కేంద్రప్రభుత్వం అమలు పరచనందుకు సభవారుపొందే ఆశాభంగంలో నేను పాలుపంచుకోకుండా వుండలేను. రాష్ట్రాలతో విడివిడిగా చర్చించగలనని కేంద్రప్రభుత్వం వాగ్దానం చేసినా ఆవిషయంలో యేమీ పనిజరగనందుకు చింతి

స్తున్నాను. ఆఖరికి 1959-60 లో నయినా యీ విషయంలో ఆయా రాష్ట్రాలకు సంతృప్తికరంగా చర్య తీసుకొనబడగలదని ఆశిస్తాను."

తమ ప్రసంగాన్ని ముగిస్తూ ఆయన యిలా అన్నారు: "మన వనరులలో మార్పు లేకపోయినా ప్రజల ప్రాథమికావసరాల విషయంలో మన బాధ్యతలు నిరంతరం హెచ్చుతున్నాయి. మనకి యేర్పడిన విషయాలలో పన్ను విధింపు విషయంలో యిక హెచ్చింపుకి అవకాశంలేని పరిస్థితిని సమీపిస్తున్నట్టు కనబడుతుంది. హెచ్చింపుకి హెచ్చుఅవకాశాలున్న వనరులుగల కేంద్రప్రభుత్వం రాష్ట్రాలకింకా యెక్కువగా తోడ్పడాలి. ఈసారి నియమింపబడే ఆర్థిక వ్యవహారాల సంఘం యీ విషయాన్ని బాగా క్షుణ్ణంగా కేంద్ర యెక్సైజు సుంకాలలో, యేవో కొన్ని అంశాలలో కాక కేంద్ర ఎక్సైజు సుంకాలకు లోబడిన అన్ని అంశాలలోను యింకా పెద్దవాటా యిస్తుందని నమ్ముతున్నాను."



# జిల్లాల వార్తలు

## గుంటూరులో జిల్లాగోష్ఠి

"ఆరున్నర సంవత్సరాల క్రిందట ఆరంభమయిన సమాజాభివృద్ధి కార్యక్రమం యిప్పుడు ఒకానొక ఘట్టాన్ని చేరింది, అక్కడ పునరాలోచన అవసరం" అని గుంటూరు జిల్లా మూడవ గోష్ఠిని ప్రారంభిస్తూ ప్రణాళికలు, అభివృద్ధిశాఖామంత్రి శ్రీ వి. బి. రాజు అన్నారు. జిల్లాస్థాయిలో జిల్లాపరిషత్తు ద్వారాను, బ్లాకుస్థాయిలో పంచాయతీ సమితులద్వారాను, గ్రామస్థాయిలో గ్రామసభ ద్వారాను, అమలు జరిగే ప్రభుత్వ కార్యకలాపాలన్నిటికీ సమాజాభివృద్ధి అగ్రగామి కాగలదన్నారు. అంతకుముందు మంత్రిగారు యీ గోష్ఠిసందర్భంలో యేర్పాటయిన ప్రదర్శనను ప్రారంభించారు.

మొట్టమొదట జిల్లాకలక్టరు శ్రీ ఎమ్. ఏ.హలీమ్, ఐ. ఏ. ఎస్. మంత్రిగారికీ, అనధికార్లకు, అధికార్లకు స్వాగతంచెప్పి గోష్ఠిని ప్రారంభించమని మంత్రిగారిని కోరారు.

మంత్రిగారు ప్రసంగిస్తూ ఉద్యోగులు ప్రజలతో బాగా సన్నిహితత్వాన్ని యేర్పరుచుకొని, సాంకేతిక జ్ఞానాన్నీ తదితరమయిన జ్ఞానాన్ని వారికి కలుగచేయాలని విజ్ఞప్తి చేశారు. నిజమయిన యజమానులు తామేనని ప్రజలకి తెలియ చేయాలన్నారు; బాధ్యతను, నాయకత్వాన్ని వహించే పద్ధతి వారికి నేర్ప బడాలన్నారు.

అదనపు అభివృద్ధి కమిషనరు శ్రీ సి. నరసింహం, ఐ. ఏ. ఎస్. మాట్లాడుతూ పారిశుద్ధ్యం మున్నగు గ్రామస్థుల ప్రాథమిక అవసరాల పట్ల బాగా శ్రద్ధ చూపమని ప్రజలకు విజ్ఞప్తి చేశారు; అందుకు డబ్బు అవసరం లేదన్నారు.

సభ్యులు మూడువర్గాలుగా యేర్పడి ఆయా వర్గాలకు కేటాయించ బడిన విషయాలను గురించి చర్చించారు. చర్చలు వ్యవసాయం, పశు పోషణ, ఆరోగ్యం, గ్రామ పారిశుద్ధ్యాలను గురించి జరిగాయి.

మంత్రిగారు, తదితరులు ఎన్నో విషయాలను తెలిపే సాంస్కృతిక కార్యక్రమాన్ని తిలకించారు. రెండురోజుల గోష్ఠి అనంతరం జిల్లాప్రణాళికల అధి



"నయాంపైసాపాట"—భద్రగిరి బ్లాకు గిరిజన బాలుడు. 1959 ఫిబ్రవరి 24,25 తేదీలలో హైదరాబాదులో ప్రణాళికలు, అభివృద్ధిశాఖ యేర్పాటు చేసిన సాంస్కృతిక కార్యక్రమాలలో యిది ఒక అంశం.

కారి శ్రీ ఎల్. మాల కొండయ్య, ఇమ్.ఏ, వందన సమర్పణ చేశారు.

## పశ్చిమగోదావరి జిల్లా

పొట్టి శ్రీరాములునగర్ : ఏలూరులో 2-1-59న పాండురంగ ప్రాథమిక పాఠశాలలో శా. స. స. శ్రీ ఎమ్. రంగయ్య విగ్రహ ఆవిష్కరణతో విద్య, సాంఘిక సంక్షేమ శాఖామంత్రి శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు యీ జిల్లాలో రెండురోజుల పర్యటనను ఆరంభించారు.

ఈ సందర్భంలో పాఠశాలావరణలో బహిరంగ సభ జరిగింది; శా. స. స. శ్రీ ఎమ్. హరిశ్చంద్రప్రసాద్ అధ్యక్షత వహించారు. మంత్రిగారు మాట్లాడుతూ స్వాతంత్ర్య పోరాటం రోజులలో శ్రీ రంగయ్య చేసిన బృహత్సేవకు ఆయనను ప్రస్తుతించారు. 1959 మార్చి నెలాఖరుకు ఆ జిల్లాలోని అన్ని ప్రాథమిక పాఠశాలల నిర్వహణను ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుందని చెప్పి ప్రభుత్వంతో సహకరించమని నిర్వాహకులందరినీ కోరారు. ఈ పని కేవలం విద్యార్థులు, వుపాధ్యాయుల శ్రేయస్సు దృష్ట్యా చేయబడుతున్న దన్నారు. 6-14 సంవత్సరాల పిల్లల్లో నిరక్షరాస్యతను తొలగించుటకు-ద్వితీయ ప్రణాళిక ఆఖరు నాటికి కాకపోయినా కనీసం 1965 నాటికి తొలగించుటకు ప్రభుత్వం శాయశక్తులా కృషిచేస్తున్నదన్నారు.

22-1-59న మంత్రిగారు చిననిద్రకొలనుకి వెళ్ళారు. అక్కడ ఆయనకు శా. స. స. శ్రీ సి. హెచ్. ఎస్. ఆర్ వి. పి. మూర్తిరాజు, శా. మం. స. శ్రీ తుమ్మల వీరభద్రరావు ప్రభృతులు స్వాగతమిచ్చారు. తరువాత అయన బైనేపల్లి వెళ్లి అక్కడ హరిజన కాలనీలో "పొట్టి శ్రీరాములు నగర్"కి శంకుస్థాపన చేశారు; హరిజనులు సమర్పించిన స్వాగత పత్రాన్ని స్వీకరించారు. ఆయన తోకలపల్లిలోని బాపూజీనగర్, హరిజన కాలనీ, కమ్యూనిటీ హాలులను కూడా చూశారు. తరువాత పెదనిద్రకొలను వెళ్లి అక్కడ వాయుయంత్రాన్ని" చూచారు.

గణపవరంలో సి. బి. ఆర్. బోర్డు వున్నత పాఠశాలకి శంకుస్థాపన చేశారు. ఈ సందర్భంలో బహిరంగసభ జరిగింది. శా. స. స. శ్రీ సిహెచ్. ఎస్. ఆర్. వి. పి. మూర్తిరాజు అధ్యక్షత వహించారు. మంత్రిగారు పంచాయతీబోర్డు అధ్యక్షస్థానానికి మహిళను యెన్నుకొన్నందుకు గ్రామస్థులను అభినందించారు. ప్రజాస్వామ్యంలో గ్రామాల సహకారం లభించినట్లయితే భవిష్యత్తుకేకాక ప్రస్తుతానికికూడా యెంతో సేవ చేయవచ్చు. పండిట్ నెహ్రూ నాయకత్వాన దేశాభ్యున్నతికై అంతా కష్టపడి పని చేయాలని కోరారు. పాఠశాలకవసరమయిన సహాయాన్ని యిచ్చే విషయం ప్రభుత్వం పరిశీలిస్తుందని గ్రామస్థులకు హామీనిచ్చారు.

## జిల్లా స్థాయిగోష్ఠి

ప్రణాళికలు, అభివృద్ధి, సమాచారశాఖా మంత్రి శ్రీ వి. బి. రాజు 14-2-59 న ఏలూరులో పశ్చిమ గోదావరి నాలుగవ జిల్లా స్థాయిగోష్ఠిని ప్రారంభించారు. మొట్టమొదట జిల్లా కలక్టరు శ్రీ ఆర్. వి. మధుసూదనరావు, ఐ.ఏ.ఎస్., మంత్రిగారికి స్వాగతం చెబుతూ జిల్లాలో సమాజాభివృద్ధి కార్యక్రమం సాధించిన పనులను సమీక్షించారు. బ్లాకు యేజన్సీ యింతవరకూ ప్రజలలో మూకవుమ్మడి చైతన్యాన్ని కలిగించలేదని యీ సందర్భంలో ఆయన అన్నారు; గ్రామ సంస్థల మనఃపూర్వక సహకారాన్నికూడా పొందలేదన్నారు. ఈ అడ్డంకులను తొలగించి సమాజాభివృద్ధి కార్యక్రమాన్ని ప్రజోద్యమంగా మార్చుటకై మార్గాలను అన్వేషించమని గోష్ఠిలో పాల్గొన్న వారిని ఆయన కోరారు. వ్యవసాయోత్పత్తిని అధికం చేయవలసిన అవసరాన్ని నొక్కిచెబుతూ మౌంటు ఆబూ మహాసభ సిఫార్సులను అమలుజరుపుటకు ఆచరణయోగ్యమయిన సూచనలు చేయమనికూడా ఆయన వారిని కోరారు.

ఈ సందర్భంలో మంత్రిగారు మాట్లాడుతూ సమాజాభివృద్ధి కార్యక్రమం జాతీయ కార్యక్రమమనీ, దేశాన్నెదుర్కొనే సాంఘిక, ఆర్థిక సమస్యల పరిష్కారానికై అన్నిపార్టీలు అందులో చురుగ్గా పాల్గొనాలని అన్నారు. అభివృద్ధి కార్యక్రమం వేగాన్ని హెచ్చించుటకై పంచాయతీబోర్డులు, సమితులు, జిల్లాబోర్డుల కార్యకలాపాలను యేకీకృతం చేయాలన్నారు.

సమాజాభివృద్ధి కార్యక్రమం ప్రసక్తి తెచ్చి, వెనుకబడివున్న గ్రామాల అభివృద్ధికై గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా, భూములబాగు, నీటి పారుదల సౌకర్యాలు, వైద్య సౌకర్యాలు మున్నగువాటికి సంబంధించిన కార్యక్రమాలెన్నో అమలు జరుగుతున్నాయన్నారు. ప్రణాళికా పథకాల విజయానికై జిల్లా కలక్టరు దగ్గరనుంచి గ్రామకరణంవరకూ అంతా సహకరించాలని నొక్కి చెప్పారు.

తరువాత ఆయన జిల్లాలో వుత్తమోత్తములయిన పొగాకు, వరి వుత్పత్తిదారులకు బహుమతులు పంచి పెట్టారు. గోష్ఠి కార్యక్రమంలో మిక్కిలి ముఖ్యమయిన నీటి పారుదల, వ్యవసాయం, సహకారాలకు మాత్రమే స్థానమిచ్చినందుకు ఆయన ప్రశంసను వెలిబుచ్చారు.

జిల్లా ప్రణాళికలు, అభివృద్ధికమిటీ వుపాధ్యక్షుడు శ్రీ వి. వెంకటనారాయణ వందనసమర్పణ చేశారు. అప్పుడు కార్యక్రమంలోగల విషయాలను చర్చించుటకై వుద్యోగులు, అనధికారులు మూడు వర్గాలుగా యేర్పడ్డారు.

## నెల్లూరు జిల్లా

కుల్లూరు పంపింగ్ పథకం: ఈ పథకాన్ని 9-2-59న ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి ప్రారంభించారు. ఈ సందర్భంలో పెన్నారు నదీ తీరాన వెయ్యిమందికిపైగా గ్రామస్థులు చేరారు; ఈ పథకం ప్రారంభంతో వారి చిరకాలవాంఛిత మీడేరింది.

ఈపథకానికి యించుమించు రూ. 1 లక్ష ఖర్చు కాగలదు. ఇది పెన్నారునదినుంచి నీటినితోడి, 1 1/2 మైళ్ళ పొడవు, 5 అడుగుల వెడల్పుగల కాలువ గుండా నల్లచెరువుకి పంపబడుతుంది. ఇందువల్ల ఆచెరువు నిలవశక్తి హెచ్చుతుంది. దీనివల్ల 469 యెకరాలకు స్థిరమైన నీటిపారుదల సౌకర్యాలుకూడ కలుగుతాయి. 177 యెకరాలు కొత్తగా సాగులోనికి వస్తాయి. ఇందువల్ల 124 టన్నుల అహారం అదనంగా వుత్పత్తి అవుతుంది. అవసరమయిన పరికరాలు యిదివరకే సంపాదించబడ్డాయి. ఈ సంవత్సరం మేనెలనుంచి యీప్రాజెక్టు వుపయోగంలోకి వస్తుంది.

ముఖ్యమంత్రి ప్రాజెక్టును ఆరంభిస్తూ ఆశయాన్ని సిద్ధింప చేసుకున్నందుకు గ్రామస్థులను అభినందించారు. దేశమంతటా ఎంతో ఉపయోగకరమయిన పెద్దపనులు చేపట్టబడుతున్నా యన్నారు. కాని గ్రామాలలో చిన్న పథకాలవల్లనే తక్షణ సహాయం సమకూరుతుందన్నారు. కాబట్టి బహుళార్థ సాధకమయిన భారీ ప్రాజెక్టులతోపాటు సాధ్యమయినన్ని చిన్నతరహా నీటిపారుదల పథకాలను చేపట్టుట ప్రభుత్వ విధానమన్నారు; ఇందువల్ల తక్కువ ఖర్చుతో యెక్కువ ప్రాంతానికి శీఘ్రంగా మేలు చేకూర్చవచ్చునన్నారు.

సోమశిలప్రాజెక్టు, కావలి-కనుపూరు కాలవ పథకాల ప్రసక్తితెచ్చి, కృష్ణ నీరుకూడా లభించనిదే సోమశిలప్రాజెక్టు వుపయోగం పూర్తి కాదన్నారు. శ్రీశైలం సమీపంలో కృష్ణానది నీటివాడకానికై తలపెట్టిన పథకంవల్ల నెల్లూరుజిల్లాలో కూడా విస్తార ప్రదేశానికి లాభిస్తుందన్నారు. కావలి-కనుపూరు కాల్వలవిషయంలో, ప్రజలనుంచివచ్చే అడ్వాన్సుల వాగ్దానాలను గమనించుట మంచిదేకాని, యీ విషయంలో నిర్ణయంచేసేఅంశం కేవలం రాష్ట్రప్రభుత్వానికి వదలివేయబడలేదన్నారు. ప్లానింగు కమిషను, కేంద్రప్రభుత్వాల ఆమోదం అవసరంఅనీ, అదిలభించనిదే యేపనీ ఆరంభించుటకు వీలులేదనీ అన్నారు.

ప్రభుత్వం యిప్పుడు నీటిపారుదల సౌకర్యాల అభివృద్ధికి యెక్కువ ప్రాధాన్యం యిస్తున్నదనీ మొత్తం ప్రణాళికా కేటాయింపునుంచి 46 శాతం నీటిపారుదల, విద్యుచ్ఛక్తిల అభివృద్ధికై కేటాయించబడినదనీ యీ సందర్భంలో అధ్యక్షత వహించిన నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖామంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు అన్నారు. రైతులు అనిశ్చితమయిన వర్షాలపై ఆధారపడే అవస్థను తప్పించుటలో యీ కొత్తప్రాజెక్టులు చాలా తోడ్పడుతుతాయన్నారు. ప్రభుత్వం చిన్నతరహా నీటిపారుదల పథకాలకు అధికప్రాధాన్యం యిస్తున్నదని చెబుతూ ప్రణాళిక సఫలతకై ప్రజలు మనస్ఫూర్తిగా సహకరించాలని విజ్ఞప్తిచేశారు.

కా. స. స. శ్రీ పి. వెంకటస్వామిరెడ్డికూడా సోమశిల ప్రాజెక్టు అవసరాన్నిగురించి నొక్కి చెప్పారు; దానివల్ల ఆ జిల్లాలో నాలుగు తాలూకాలకు, చిత్తూరుజిల్లాలో కాళహస్తి తాలూకాకు లాభం కలుగుతుందన్నారు. కుల్లూరుకి త్వరలో విద్యుచ్ఛక్తిని సరఫరా చేయాలన్నారు.

## విశాఖపట్నం జిల్లా

సమాజాభివృద్ధిగోష్ఠి : విశాఖపట్నంలో ఫిబ్రవరి 9, 10 తేదీలలో జరిగినగోష్ఠిలో సమాజాభివృద్ధి కార్యక్రమం అమలులో కలుగుతున్న చిక్కులను గురించి చర్చించబడింది.

విశాఖపట్నం జిల్లా కలక్టరు శ్రీ ఐ. జె నాయుడు అధ్యక్షత వహించారు.

గోష్ఠిలో ముఖ్యంగా (1) పరిపాలనావికేంద్రీకరణ (2) వ్యవసాయం (3) నీటిపారుదల, భూమి బాగులకు సంబంధించిన విషయాలుచర్చించ బడ్డాయి.

కార్యక్రమం అమలుకై జిల్లాలోని అభివృద్ధి శాఖలలో పని చేస్తున్న వారి మధ్య యింకా యెక్కువ సహకార సమన్వయాలు, పరస్పర సానుభూతి, అవగాహనలు వుండాలని గోష్ఠిని ప్రారంభిస్తూ శ్రీ ఐ. జె. నాయుడు నొక్కి చెప్పారు. అభివృద్ధి కార్యక్రమ కార్యకర్తలు హృదయ పూర్వకంగా పనిచేయాలనీ, అది ఒక్కొక్కప్పుడు మానవుని బుద్ధి కుశలత సాధించలేని పనిని కూడా సాధిస్తుందనీ అన్నారు. పరిపాలనా వికేంద్రీకరణ అవసరాన్ని గురించి నొక్కి చెబుతూ అది సామర్థ్యానికి కీలకమన్నారు. కార్య క్రమానికి సంబంధించిన కార్యకర్తలంతా కృషి చేసినపుడు సామర్థ్యం బాగా హెచ్చుట తథ్యమన్నారు.

అంతకుముందు జిల్లా ప్రణాళికల అధికారి శ్రీ టి. త్రియంబకం ప్రతినిధులకు స్వాగతమిస్తూ జిల్లాలోని అన్ని అభివృద్ధి కేంద్రాలు, అరకులోయ హుకుంపేటల బహుళార్థ సాధక ప్రాజెక్టులలో సమాజాభివృద్ధి కార్యక్రమం ప్రగతిని సమీక్షించారు.

సాధారణ సభకిజిల్లాకలక్టరు అధ్యక్షతవహించారు. పనిశీఘ్రింగా జరుగుటకై రూ. 25,000 వరకూ గల పనుల విషయంలో అంచనాలను, రూ. 20,000 వరకూగల పథకాలను మంజూరుచేసే అధికారం కలక్టరికి యివ్వాలని ఆ సభ సిఫార్సు చేసింది. రూ. 10,000 వరకూ పరిమితిగల పనులను ప్రాజెక్టు సలహా సంఘంతో సంప్రదించి అప్పగించే అధికారం పి ఇ. ఓ. లకు యివ్వాలనీ, రూ. 10,000 మించిన పనులు కలక్టరు ఆమోదానికి పంపబడాలనీ సిఫార్సు చేసింది. బి. డి. ఓ. పదవి గెజెటెడ్ హోదాగా అభివృద్ధి చేయబడాలని కూడా ఆ కమిటీ భావించింది. జిల్లాలోని బ్లాకు ట్రూపులచే సమాజాభివృద్ధి కార్యక్రమం పంచవర్ష ప్రణాళికలకు సంబంధించిన వినోద కార్యక్రమాలు ప్రదర్శించ బడ్డాయి. శ్రీమతి రత్నాదేవినాయుడు కళాకారులకు బహుమతులను, సర్టిఫికెట్లను యిచ్చారు.

## శ్రీకాకుళం జిల్లా

కార్యాలయ భవనం : విద్య, సాంఘిక సంక్షేమ శాఖామంత్రి శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు 6-2-59 న నరసన్నపేటలో బ్లాకు అభివృద్ధి కార్యాలయం కార్యాలభవనానికి శంకుస్థాపన చేశారు. నరసన్నపేట బ్లాకు అభివృద్ధి అధికారి శ్రీ కె. విశ్వనాథం భవనం స్థలంవద్ద మంత్రిగారికి, తదితరులుకు స్వాగతం చెప్పారు. శ్రీకాకుళం డివిజనల్ ఆఫీసరు శ్రీ జి. ఎస్. నాగభూషణం, శాసనసభ్యులు శ్రీయుతులు ఎల్. ఎల్. దాసు, పి. గున్నయ్య ప్రభృతులు యీ సందర్భరలో హాజరయారు.

మంత్రిగారు గ్రామ సహాయకులతో ముచ్చటిస్తూ ఆహారోత్పత్తిని అధికం చేయుట పట్ల, గ్రామాలలో యితర అభివృద్ధి కార్యక్రమాలపట్ల యెక్కువ శ్రద్ధతీసుకోమని సలహాయిచ్చారు. వరి వుత్పత్తిలో రాష్ట్రి బహుమానాన్ని అందుకొన్న కరిమి సుబ్బయ్య నాయుడు మంత్రిగారికి పరిచయం చేయబడ్డారు. గ్రామ సహాయకులు, ప్రతిభావంతులయిన కళాకారులు అయిన శ్రీయుతులు కన్నేపల్లి సుబ్రహ్మణ్యం, విస్సా అప్పయ్యగార్లకు మంత్రిగారు బహుమతులు యిచ్చారు.

## చిత్తూరు జిల్లా

పూర్వ విస్తరణ కేంద్రి: 12-2-59 న గంగాధ్ర నెల్లూరు పట్టణంలో పూర్వ విస్తరణ అభివృద్ధి కేంద్రానికి ప్రారంభోత్సవం జరిగింది. ఈసందర్భంలో వ్యవసాయ, మత్స్య, పరిశ్రమలు, వాణిజ్య శాఖలు, పలమనేరుది, ప్రభుత్వ పట్టుపరిశ్రమవిభాగం, వైద్య, ప్రజారోగ్య, స్త్రీ సంక్షేమశాఖలు ప్రదర్శన స్టాళ్ళను యేర్పాటు చేసినవి.

శాసనసభ్యుడు, చిత్తూరు జిల్లా ప్రణాళికలు, అభివృద్ధి సంఘం వుపాధ్యక్షుడు అయిన శ్రీ ఎన్. పి. చెంగలాయనాయుడు జాతీయ పతాకను ఆవిష్కరించి ప్రదర్శనను ప్రారంభించారు. జిల్లా ప్రణాళికల అధికారి శ్రీ కె. సత్యనారాయణరావు, అదనపు జిల్లా వ్యవసాయాధికారి శ్రీ వెంకటేశ్వర్లు, జిల్లా పబ్లిసిటీ అసిస్టెంటు శ్రీ దొరస్వామిరెడ్డి రిటైర్డు మునిసిపలు కమిషనరు శ్రీ ఎస్. వి. జగ్గారావు గారలు నెల్లేపల్లి గ్రూపుకివెళ్లి పూర్వ విస్తరణ అభివృద్ధికేంద్రం ఆళయాలపై గ్రామస్థులనుద్దేశించి ప్రసంగించారు; గ్రామాలకు నూతన జీవితసాధనలో సహకరించమని వారికి విజ్ఞప్తిచేశారు.

పల్లిపట్టు బ్లాకు అభివృద్ధి అధికారి శ్రీ మహమ్మదు మస్తాన్, జిల్లా ప్రణాళికల సంఘం సభ్యుడు శ్రీ జి. రామమూర్తిగార్లు తుమ్గుంద్రానికి, ముఖ్య గ్రూపులకి వెళ్ళి గ్రామస్థులనుద్దేశించి ప్రసంగించారు. శా. స. స. శ్రీ ఎన్. పి. చెంగలాయనాయుడు, బ్లాకు అభివృద్ధి అధికారి శ్రీ జె. బాలయ్యనాయుడు లతోకూడిన మరొక బృందం నరసింగరాయనిపేటకు వెళ్లి గ్రామస్థుల నుద్దేశించి ప్రసంగించారు.

సాయంకాలం గంగాధ్రి నెల్లూరుకి వచ్చిన వ్యవసాయ, అటవీశాఖా మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డికి వుద్యోగులు, అనధికార్లు స్వాగతమిచ్చారు. మంత్రిగారు విత్తనాలస్టోరు నిర్మాణానికి శంకుస్థాపన చేశారు. ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించిన జిల్లా కలక్టరు బషీర్ అహమ్మద్ తహీర్ పూర్వ విస్తరణ అభివృద్ధికేంద్రం స్వభావాన్ని క్లుప్తంగా వివరించి ప్రజాసహకారానికై విజ్ఞప్తిచేశారు. శ్రీ చెంగలాయనాయుడు మంత్రిగారికి స్వాగతం చెప్పా . గంగాధ్రి నెల్లూరు పంచాయతీ, ప్రజలు ఆయనకు స్వాగతంపత్రం సమర్పించారు. మంత్రిగారు కేంద్రాన్ని ప్రారంభిస్తూ రైతుల పరిస్థితి అభివృద్ధికై తీసుకొనబడే చర్యలను వివరించి, గ్రామీణ ప్రాంతాలలో జరిగే అభివృద్ధి కార్యకలాపాలలో అన్ని స్థాయిలలోను ప్రభుత్వం యంత్రాంగంతో రైతులు సహకరించాలని అన్నారు.

కడప వ్యవసాయ డిప్యూటీ డైరెక్టరు శ్రీ ఎ. వీరభద్రరావు పెద్ద తిప్పసముద్రం రైతు శ్రీ నారాయణరెడ్డిని మంత్రిగారికి పరిచయం చేశారు. 62-1/4 బస్తాల వరిని పండించిన ఆ రైతుకు ఆయన రూ. 250/- విలువచేసే మండల బహుమతిని యిచ్చారు. ముఖ్యమంత్రి, శాసనమండలి అధ్యక్షుడు శ్రీ ఎమ్. హనుమంతురావు ప్రభృతులు పంపిన సందేశాలను శ్రీ చెంగల్రాయనాయుడు చదివారు.

ఈ సందర్భంలో నాటకాలు, బుర్రకథలు, నాట్యాలు, పంచవర్ష ప్రణాళిక కార్యకలాపాలపై ఒక ఫిల్ము ప్రదర్శన యేర్పాటు చేయబడ్డాయి; యించుమించు 10,000 మంది వాటిని చూచి, ప్రదర్శన స్టాళ్లను దర్శించారు. వైద్య ప్రదర్శనస్టాలు వుత్తమోత్తమమయినదిగా నిర్ణయించబడింది; ప్రజారోగ్య, స్త్రీ సంక్షేమస్టాళ్లు ఆ తరువాతి స్థానమాక్రమించాయి. సాంస్కృతిక కార్యక్రమాలలోను, ప్రదర్శన స్టాళ్లలోను పాల్గొన్నవారికి కలక్టరు బహుమతులను పంచి పెట్టారు.

## నల్గొండ జిల్లా

సాంఘిక సంక్షేమ కాలనీ: భువనగిరి పంచాయతీ సమితి బ్లాకుకి ప్రభుత్వం ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని మంజూరుచేసింది. ప్రజల విరాళం లేక అది తాత్కాలికంగా రైగిరి గ్రామంలో యేర్పాటు చేయబడింది. పంచాయతీసమితి అధ్యక్షుడు శ్రీ పి. వెంకటపాపిరెడ్డి, శ్రీ టి. లక్ష్మిరెడ్డిగార్ల శ్రమఫలితంగా మూటకొండూరు చుట్టుపట్లగల గ్రామాలలో రూ. 10,000 వసూలు అయాయి. ఆరోగ్యకేంద్రానికి విరాళాలిచ్చుటకై గ్రామీణులు వుత్సాహంతో ముందుకు వచ్చారు. ప్రజల విరాళాన్ని మూటకొండూరు

గ్రామస్థులు డిపాజిట్టుచేసినందున ఆరోగ్యకేంద్రాన్ని రైగిరినుంచి అక్కడికి తరలించుటకు పంచాయతి సమితి సమ్మతించింది.

భువనగిరి పంచాయతిసమితి అధ్యక్షుడు శ్రీ టి. వెంకటపాపిరెడ్డి భువనగిరిబ్లాకు చేకుల్సోమారం గ్రామంలో సాంఘిక సంక్షేమకాలనీకి శంకుస్థాపన చేశారు. ప్రస్తుతం పదిగృహాలు నిర్మించబడుతున్నాయి. పెద్దసభలో ప్రసంగిస్తూ సమితి కార్యక్రమం జయప్రదమయిన అమలుకై పూర్తి సహకారాన్నిమ్మని శ్రీ రెడ్డిప్రజలకు సలహాయిచ్చారు.

జిల్లాకలక్టరు శ్రీ శ్రావణకుమార్, జిల్లాప్రణాళికల అధికారి శ్రీ గణేశసింగుతో కలిసి భువనగిరి పంచాయతీ బ్లాకుకువెళ్ళి, అనాజ్‌పురం, యాదగిరిగుట్ట గ్రామాలను దర్శించారు. అనాజ్‌పురంలో రక్షిత నీటిసరఫరా పథకాన్ని, ప్రజలవిరాళంతో యిటీవల గ్రామస్థులు నిర్మించినరోడ్డును ఆయన తనిఖీచేశారు. నల్గొండజిల్లాలో ఒక్క అనాజ్‌పురం గ్రామంలోనే రక్షిత నీటిసరఫరాపథకం అమలు పరచబడింది. నీటిసరఫరా పథకానికై గ్రామస్థులు రూ 2,500 యిచ్చారు.

సూర్యాపేటలో చిన్నపెుత్తాల పొదుపువసూళ్ళ సందర్భంలో ప్రదర్శితమయిన నాటకానికి కలక్టరు హాజరయ్యారు.

## గ్రామసహాయకుల శిక్షణాశిబిరం

చింతపల్లిబ్లాకు (మొదటిఘట్టం) అధ్వర్యాన 1959 జనవరి 16 నుంచి 18 వరకూ కొప్పలలో ప్రత్యేక వ్యవసాయవర్గం విషయాలపై రెండవ గ్రామసహాయకుల శిక్షణాశిబిరం జరిగింది. దేవరకొండ వ్యవసాయ సహాయకుడు, చింతపల్లిబ్లాకు (మొదటిఘట్టం) విస్తరణాధికారు (పశుపోషణ)లచే వ్యవసాయం పశుపోషణ కార్యక్రమాలపై వుపన్యాసాలివ్వబడ్డాయి. తగిన ప్రతిఫలమివ్వని పాత వ్యవసాయపద్ధతులను విడిచి ఆధునికపద్ధతుల నవలంబించమని అభ్యుదయ రైతు శ్రీ పి. కిష్టయ్య శిక్షితులకు విజ్ఞప్తిచేశారు.

నల్గొండ జిల్లాప్రణాళికల అధికారి శ్రీ సి. గణేశసింగు, నల్గొండజిల్లా వ్యవసాయాధికారి శ్రీ నజీరుద్దీన్, నల్గొండ వాణిజ్య, పరిశ్రమల అసిస్టెంటు డైరెక్టరు శ్రీ డి. ప్రసాద్, నల్గొండ సి. డి., ఎల్. డి. పనుల అసిస్టెంటు ఇంజనీరు శ్రీ ఎమ్. వెంకటరావు గార్లు శిబిరాన్నిదర్శించి శిక్షితులనుద్దేశించి ప్రసంగించారు. 16-1-59 న జపానుపద్ధతి వరిసాగు, పెంటయెరువు తయారీ, సతులాహారాలపై ఫిల్ము ప్రదర్శనలు యేర్పాటు చేయబడ్డాయి. 17-1-59 న హైదరాబాదులోని కేంద్రప్రభుత్వపు పంచవర్ష ప్రణాళిక ప్రచారం ప్రాంతీయ ప్రచార అధికారి సహాయంతో మరొక ఫిల్ముప్రదర్శన యేర్పాటు చేయబడింది.

## మహబూబునగరం జిల్లా

బియ్యందంపు. "మెరిసేదంతా బంగారం కాదు": అని అఖిలభారత గ్రామపరిశ్రమల సంఘం తరఫున యేర్పాటు చేయబడిన బియ్యందంపు, బియ్యం పరిశ్రమ సొసైటీ శిక్షితుల నుద్దేశించి ప్రసంగిస్తూ జిల్లా ప్రణాళికల అధికారి శ్రీ పి. రాజగోపాలరావు అన్నారు. మెరుగు పెట్టనిబియ్యం తెల్లగావుండవు, కాని వాటిలో బెరి-బెరీవ్యాధిని నిరోధించే 'బి' విటమిను పుష్కలంగావుంది అన్నారు. పొట్టుతీయుటకు చక్కీపై విసరుట, మెరుగుకి ఢెర్కీ నుపయోగించుట తమతమ గ్రామాలలో వ్యాప్తిలోనికితెమ్మని ఆయన శిక్షితుల నుద్బోధించారు. శ్రీ కె. ఆర్. టాకూరు ప్రణాళికల అధికారిచేసిన అమూల్యమయిన సూచనలను ప్రస్తుతిస్తూ వందనసమర్పణ చేశారు.

## మెదక్ జిల్లా

పాఠశాలాభవనం. మెదక్ జిల్లాకలెక్టరు శ్రీ ఎన్. కె. సేత్, ఐ. ఏ. ఎస్, 12-2-59 న సదాశివపేట బ్లాకు చంద్రాపురం గ్రామంలో పాఠశాలా భవనాన్ని ప్రారంభించారు. ఈభవనం రూ. 45,000తో నిర్మించబడింది. ఇందులో మూడవవంతును ప్రజలు యిచ్చారు.

సభలో ప్రసంగిస్తూ ఆయన ప్రజలను ప్రశంసించి, వారుచూపిన వుత్సాహానికి సంతృప్తి వెల్లడించారు. ముందుకువచ్చి మిగిలిన అభివృద్ధి కార్యక్రమాలలో కూడా చురుగ్గాపాల్గొనమని వారికి సలహాయిచ్చారు.

బ్లాకులో యితరపనులకు విరాళమిచ్చి బ్లాకు నిధులను వినియోగించుకోమని కూడా సలహాయిచ్చారు. గ్రామప్రతినిధి శ్రీ సంగప్ప కలక్టరికి స్వాగతమిచ్చారు. అంతకుముందు కలక్టరు గ్రామంలోని మురుగుకాలవలను, బావిని తనిఖీచేశారు. ఈ సందర్భంలో జిల్లాప్రణాళికల అధికారి శ్రీ ప్రేమ్‌రాజ్ మాథుర్ కూడా అక్కడ వున్నారు.

## శ్రీకాకుళం జిల్లా

మేలా : సీతంపేట యేజన్సీ బ్లాకు అధ్వర్యాన సీతంపేట గ్రామంలో 15-2-59 మొదలు 17-2-59 వరకూ కమ్యూనిటీ మేలా జరిగింది. జిల్లా కలక్టరు, జిల్లా ప్రణాళికల అధికారి, జిల్లా పశువైద్యాధికారి, పా. స. శ్రీ బి. సత్యనారాయణ దొరలు యీ మేలా వుత్సవాలను దర్శించినవారిలో ప్రముఖులు.

వ్యవసాయం, పశుపోషణ, కుటీర పరిశ్రమలు, స్త్రీ సంక్షేమం, సహకారం, ఆరోగ్యం, విద్యమున్నగువాటిలో అభివృద్ధి కార్యకలాపాలను సూచించే స్టాలులు యేర్పాటుచేయబడ్డాయి. ఆదర్శ గ్రామం నమూనాను ప్రదర్శించే ప్రత్యేక స్టాలు కూడా ఒకటి యేర్పాటు చేయబడింది.

రాత్రిళ్లు ఫిల్ముప్రదర్శనలు, భజనలు, భాగవతాలు, నాటకాలు, బుఱ్ఱకథలు వగైరా యేర్పాటు చేయబడ్డాయి.

17-2-59 న సాంస్కృతిక పోటీలవంటి వివిధ కార్యకలాపాలలో గెలుపొందినవారికి బహుమతులు యివ్వబడ్డాయి. రాష్ట్ర గిరిజన సంక్షేమ సంఘం సభ్యుడు, బ్లాకు ప్రణాళికలు, అభివృద్ధి సంఘం వుపాధ్యక్షుడు అయిన శ్రీ ఎమ్. సుబ్బన్న బహుమతులను పంచిపెట్టారు. బ్లాకు అభివృద్ధి అధికారి శ్రీ వై. సీతారామమూర్తి కమ్యూనిటీ మేలా ఆశయాలను, ప్రాధాన్యాన్ని గురించి వివరించారు.



# ఆనంద బాష్పాలు

ఒక పబ్లిసిటీ అసిస్టెంటు

"చింతలకు కన్నీటికి స్వస్తిచెప్పి మేమెంతో ఆనందంగా వున్నాం" అని అనంతపురం జిల్లా ధనంచెర్ల గ్రామంలో 70 సంవత్సరాల వృద్ధుడు గురప్ప ఆ గ్రామంలో కొత్తగా పూర్తయిన నీటి సరఫరా పనులనుగురించి అభిప్రాయ మడిగినప్పుడు అన్నాడు.

ధనంచెర్ల గుంతకల్లుకి యించుమించు పదిమైళ్ల దూరంలోగల ఒక కొండగుట్టపై వుంది. గుంతకల్లు దక్షిణభారతంలో మిక్కిలి ముఖ్యమయిన రైల్వే కూడలులలో ఒకటి. వందగడపకూడా లేని యీ గ్రామంజనాభా 500; అదిశృంగార రసస్ఫోరక మయిన వాతావరణంతో, అరుదయిన ప్రకృతి సౌందర్య దృశ్యాలతో అలరారుతూ దూరంనుంచి చూసేవారికి యెంతో ఆకర్షణీయంగా కనబడుతుంది. కానిఅది కరువుకి, వర్షాభావానికీ పేరుపడిన జిల్లాలో యించుమించు 2 ఫర్లాంగుల యెత్తు కొండగుట్టపై వున్నందున, యీ గ్రామం అనాదినుంచీ నీటియెద్ద డితో యిబ్బంది పడుతున్నది. గ్రామంలో బావికాని కాలువకాని యే విధమయిన నీటివసరు లేదు గ్రామ స్థులు కొండదిగి క్రిందకువచ్చి అక్కడినుంచి పైకి నీటిని మోసుకొనుట తప్పనిసరి అయిపోయింది. కాబట్టి 'కొండంత కష్టానికి కుండెడునీరు' అన్నమాట వారికి సామెతగా మారిందంటే ఆశ్చర్యంలేదు.



వృద్ధుడు గడచిన కష్టాలను వివరిస్తున్నాడు.



హరిజనులను ఆనందపరవశులను చేసే కొత్తసౌకర్యం.

గురప్ప ఆనందబాష్పాలను కారుస్తూ ఆ గ్రామస్థులు నీటికోసం పడినపాట్లను, విచారగాధలను చెప్ప నారంభించాడు. ఒక చూలాలు క్రిందినుంచి పైకి నీటిని తెస్తూ నెలలు నిండకముందే ప్రసవించిన వృత్తాంతం చెప్పాడు "బాబూ, వేసంకాలంలో మా పాట్లు దేవుడొక్కడికే తెలుసు" అన్నాడు అతడు పాత విషయాలను జ్ఞాపకం చేసుకుంటూ. ఆ తరువాత పూర్వం నీరుతెచ్చుకునే బావి దగ్గరికి నన్ను తీసుకునివెళ్లి నిట్టనిలువుగావున్న కొండగట్టును చూపి, నీటిని పైకి తోడుటకు మనిషియెంత శ్రమపడాలో వూహించుకోమన్నాడు. వెనుక తాము పడినపాట్లు, ప్రస్తుత సంతోషాల దృష్ట్యా ప్రతివిషయాన్ని నాకు వివరించుటకు అతడు చూపిన ఆతురతను నేను అర్థంచేసుకోగలిగాను. "జీవనాధారమయిన నీరులేని యీ కొండపై యీగ్రామం యెప్పుడు నిర్మించబడిందో మాకెవరికీ ఆఖరికి నాతలిదండ్రులకు కూడా తెలియదు. ఈ కొండపై మీటతిప్పి నీరు సంపాదించ గలమని మేము కలలోకూడా అనుకోలేదు. సాటిలేని యిటువంటి మేలుచేసిన ప్రభుత్వానికి మేమెంతో కృతజ్ఞులం" అన్నాడు గురప్ప.

## మేలిపద్ధతులు, మేలిఫలితాలు.

"నీమాటకడ్డు వస్తున్నందుకు క్షమించు తాతా వ్యవసాయంలో కొత్తపద్ధతులని చెప్పబడే వాటివల్ల నిజంగాయేమైనాలాభముందంటావా?" అనిప్రశ్నించి అతని మనస్సుని మరోవిషయంపైకి మళ్లించాను. అతడు చిరునవ్వుతో యిలాఅన్నాడు: "నాకు తెలుసు బాబూ! మాబోటి పెద్దవాళ్లు మార్పుకి ఒప్పుకోరని అనుకుంటున్నారు. కాని స్పష్టమయిన ఫలితాలవల్ల మా ఆలోచనలు విస్పష్ట మవుతాయని అనుకోరా. ఇలా చూడండి–" అనిఅంటూ పోగుచేసిన ఆధునిక వ్యవసాయ పరికరాలను చూపించాడు. "మేలిపద్ధతుల వల్ల మేలిఫలితాలు కలుగుతాయని మేమిప్పుడు తెలుసుకున్నాం. ఉత్తమ విత్తనాలను, రసాయన

ఎరువుల్ని, పశువుల్ని వాడతాం; జపాను పద్ధతిని అవలంభిస్తాం – అది యిది అనేమిటి! ప్రతి ఆధునిక పద్ధతిని మేము అనుసరిస్తాం. కొత్తవిధానాలు మాకు పూర్తిసంతృప్తినిచ్చాయి. మన దేశం శీఘ్రంగా అభివృద్ధి చెందుతున్నదనీ, రామరాజ్యం యేర్పడగలదనీ మా అందరికీ తెలుసు. ఇదిగో కాస్త యీ పాలు తీసుకోండి" అని అంటూ ఆవృద్ధుడు ఒక కప్పుపాలు యిచ్చాడు. నేనిలా అన్నాను: "తాతా, నేడు మనదేశానికి నీవంటి మనుషులు కావాలి. నీవంటి వృద్ధుల ఆశీర్వాదంతో ప్రభుత్వం పురోగమించి ప్రజాసహకారంతో రామరాజ్యాన్ని నెలకొల్పుటనవశ్యం". ఈ మారుమూల గ్రామప్రజలు నాపట్ల చూపిన ఆదరంకంటె వారి సత్వ సంపన్నత, అభ్యుదయ దృక్పథము నన్ను చకితుని చేశాయి.

ధనంచెర్ల గ్రామం కొండగుట్టపై ప్రజలు ఒక నీటి చెరువు నిర్మించింది. గురప్ప ప్రభృతుల ఆనందానికదే కారణం. ఇది స్థానికాభివృద్ధి పనులక్రింద నిర్మింపబడింది. ఇందుకు మొత్తం రూ. 14,000 ఖర్చు అయాయి. ఇందులో రమారమి రూ. 3500లను గ్రామస్థులు యిచ్చారు. ఇది మిక్కిలి శీఘ్రంగా 1957 ఆరంభంలో పూర్తయింది. 25 అ. సక్షన్‌తో ఒకపంపు, ప్రస్తుతపు వానికి 65 అ. డెలివరీ పంపు అమర్చబడ్డాయి. వీటి యేర్పాటుకై పంపుషెడ్డు నిర్మించబడింది. నీరు 6600 గెలన్లుపట్టే జలాశయం లోనికి సరఫరా చేయబడుతుంది దానికి 6 కుళాయి లున్నాయి. ఇప్పుడు ఈనీటి సరఫరా పనులు గ్రామస్థుల సంఘంచే నిర్వహింప బడుతున్నాయి. నీరు రాత్రి పగలుకూడా దొరుకుతుంది. నీటిఖర్చు గాలకి 1/5 న.పై. కి తక్కువే. ఈ మారుమూల గ్రామ ప్రజలు చూపే వుత్సాహం నిజంగా గమనార్హం.



కావలసినంత నీరు!

ప్రణాళికా రంగంలో

# పశ్చిమగోదావరి జిల్లా ప్రగతి

1958 డిసెంబరు నెలాఖరువరకూ పశ్చిమగోదావరి జిల్లాలో ప్రణాళికక్రింద అభివృద్ధి పథకాల అభివృద్ధి ఆధికారికంగా లెఖ్ఖకట్టబడింది. దానిప్రకారం పెక్కు పద్దులక్రింద పని బాకీలేకుండా జరిగిపోయినట్లు, మిగిలినవాటిక్రింద మిగిలిన పని పూర్తి కానున్నట్లు తెలుస్తున్నది.

వ్యవసాయరంగంలో యీ జిల్లావంతుగా రైతులకు 882 టన్నుల వుత్తమ విత్తనాలు పంపిణీ చేయబడాలని లక్ష్యమేర్పరచగా యింతవరకూ 913 టన్నులు పంపిణీ అయాయి. ఈ పథకంక్రింద పనియేమీ మిగిలిపోలేదు. ఆయిల్ ఇంజన్లు, విద్యుచ్ఛక్తి మోటార్ల పంపిణీలక్ష్యాలు వరుసగా 9,9 కాగా జిల్లా వ్యవసాయాధికారి రైతులకు సరఫరా చేయుటకై అవి 13,9 మంజూరు చేయబడ్డాయి. ఇంతవరకూ ఒక ట్రాక్టరు సరఫరా చేయబడింది. గొట్టపు బావుల విషయంలో యీ జిల్లావంతు లక్ష్యం 24 కాగా 26 బావులు మంజూరు చేయబడ్డాయి. డబ్బు కూడా చెల్లించబడింది. రైతులకు పంపిణీ చేయదగు పరికరాల లక్ష్యం 8 కాగా యింతవరకూ 2 మాత్రమే పంపిణీ చేయబడినవి. ఇంకా 6 పరికరాలు పంపిణీ కావాలి. ఈ పథకంక్రింద ఆధునిక పరికరాల సరఫరాకై యెక్కువ దరఖాస్తులను పొందుటకై తీవ్రంగా ప్రచారం చేయబడుతున్నది.

పళ్ల అభివృద్ధి పథకంక్రింద పనియేమీ మిగిలిపోలేదు. రూ. 12,000 దీర్ఘకాలిక ఋణాలు, రూ. 2,000 స్వల్పకాలిక ఋణాలు యివ్వబడ్డాయి.

రైతులకు పంపిణీ చేయుటకై రూ. 1,000 ఖరీదుచేసే తేనెటీగల పెంపకం పెట్టెలు, జపాను బుష్‌పారల నిమిత్తం వ్రాయబడింది.

1958-59కి నిర్ణయించబడిన 12 విత్తనాల క్షేత్రాలు పెంచబడినవి.

విత్తనాల స్టోర్సు విషయంలో యీ జిల్లా వంతు లక్ష్యం 8. అది యింకా సాధించబడాలి.

బందకట్టు కాలవ రిమోడలింగు: దాదాపు పూర్తి అయింది. ఒక కళింగుల మాత్రం నిర్మింపబడాలి. సాగుకి నీరు ఒదలబడుతున్నది.

కృష్ణపాలెం అందనల చెరువు మరమ్మతు: లీక్ వర్కు, భవనాల నిర్మాణం పూర్తయింది. మిగిలిన పని జరుగుతున్నది.

ముత్యాలపల్లి ప్రాంతంలో పోటు (టైడల్) రక్షణకై వుద్దేశించిన పనిజరుగుతున్నది. విజయవాడ స్పెషల్ డివిజను ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు అధ్వర్యంలో 14 చెరువు మరమ్మతు పథకాలు అమలుజరుగుతున్నాయి. ఇవి 1959 మార్చి నెలాఖరుకు పూర్తి కాగలవు.

## పశుపోషణ పథకాలు

ఏజన్సీప్రాంతం: ఏజన్సీ ప్రాంతాలలో 1 ఆబోతు, 1 ఆవు, 10 కోళ్లు, 6 గొర్రెల పంపిణీకై 4 ఏజన్సీ పథకాలు వున్నాయి. ఇంతవరకూ 4 పుంజులు, 12 పెట్టలు మాత్రమే పంపిణీ చేయబడ్డాయి.

ఏజన్సీయేతరప్రాంతం: ఈ జిల్లాలో రిండరుపెస్టు నిర్మూలనకు మూకవుమ్మడి టీకాల వుద్యమం 1-4-57 నుంచి ఆరంభమయింది. ఇంతవరకూ ఆ పని ఏలూరు, చింతలపూడి, తాడేపల్లిగూడెం, కొవ్వూరు, భీమవరం, నరసాపురం తాలూకాలలో పూర్తి అయింది. ఇంక ఒక్కతణుకు తాలూకామాత్రం మిగిలింది. అక్కడ పని పూర్తి చేయబడుతుంది. 31-3-59 నాటికి యీ పథకం యెత్తివేయబడుతుంది.

ఏలూరు కోళ్ల పెంపకం విస్తరణకేంద్రం : 1958 మార్చిలో ప్రారంభింపబడింది. దీనివంతు లక్ష్యం ప్రకారం 186 వైట్ లెగ్ హారన్, 256 పెట్టలు పంపిణీ చేయబడవలసివుండగా యింతవరకూ 148 పుంజులు, 164 పెట్టలు మాత్రమే పంపిణీ చేయబడ్డాయి. ఇంకా 38 పుంజులు, 92 పెట్టలు పంపిణీ కావాలి.

దెందులూరులో 25-8-58 న చిన్నతరహా పశు వైద్య ఔషధశాల తెరువబడి పనిచేస్తున్నది.

15-3-58 న తణుకులో 6 కేంద్రాలుగల కీలక గ్రామ కేంద్రం తెరువబడింది.

మత్స్యసంపద : చిరుచేపలను నిలవచేసి సంవత్సరం పొడుగునా వాటిని ప్రైవేటు పార్టీలకు సరఫరా చేయుటకై దెందులూరులో 3 శాశ్వత చిరుచేపల పెంపకం కేంద్రాలను నిర్మించాలని సంకల్పించబడింది. ప్లానులు, అంచనాలు ఆమోదించబడ్డాయి, కాని నిర్మాణం తలపెట్టిన స్థలం ప్రైవేటు వ్యక్తులది అయినందున దాని సంపాదన వ్యవహారాన్ని రెవిన్యూ శాఖ చేపట్టింది.

జాలరులకు వుప్పును సబ్సిడీధరలకు సరఫరా చేసే పథకం ఒకటి వుంది. మంజూరయిన మత్స్య శుద్ధి కేంద్రాలు రెండిటిలోను ఒక్కటిమాత్రమే 1957 నవంబరులో చిన గొల్లపాలెంలో తెరువబడింది. రెండవ కేంద్రాన్ని తెరచే అవకాశం లేదని చెప్పబడుతున్నది. సబ్సిడీధరలకు జాల లకు సరఫరా చేయవలసిన వుప్పు విషయంలో యీ జిల్లావంతు 20-4-59 లక్ష్యం రూ. 150 మ. కాగా 80మణుగులు మాత్రమే సరఫరా చేయబడింది. ఇంకా 70 మ. సరఫరా కావలసివుంది.

ఏజన్సీ అభివృద్ధి పథకం : దీనివంతు లక్ష్యం రూ. 150 కాగా విత్తనాల ఖరీదు, రవాణా, ఏజన్సీ ప్రాంతాలచెరువుల అభివృద్ధికై యిప్పటికే రూ. 894 ఖర్చు చేయబడ్డాయి.

## పరిశ్రమలు

ఏలూరు కమ్మరి వుత్పత్తి - శిక్షణాకేంద్రం : 11 మంది శిక్షితులుగల 3 వ. జట్టు శిక్షణపొందుతున్నది. శాశ్వత భవనాల నిర్మాణం దాదాపు పూర్తి అయింది.

ఏలూరు వడ్రంగం వుత్పత్తి - శిక్షణాకేంద్రం : 11 మంది శిక్షితులుగల 3 వ. జట్టు శిక్షణపొందుతున్నది, భవనాల నిర్మాణం పూర్తి అయింది.

తాడేపల్లిగూడెం సాధారణ ప్రయోజన ఇంజనీరింగు వర్కుషాపు : భవనాల నిర్మాణం పూర్తి అయింది. పబ్లిక్ వర్కుసుశాఖ వాటిని 2-1-59 న పరిశ్రమలశాఖకి అప్పగించింది. ఈ పథకాన్ని త్వరలోనే అమలు పరచవలసివుంది.

పాదరక్షలతయారీ-శిక్షణాకేంద్రం :- 20 మందికి శిక్షణనిచ్చుటద్వారా శిక్షణాపథకంలోని పాదరక్షల విభాగం అమలు పరచబడింది. ఇంచుమించు రూ 38,000 యంత్రాలకై వ్రాయబడింది.

భవనంలేని కారణాన తోలుపనులుపథకం అమలు పరచబడలేదు.

## కుటీరపరిశ్రమలు

మొగల్తూరు పీచువుత్పత్తి-శిక్షణాకేంద్రం :- 12 మందికి శిక్షణ యివ్వబడింది. 15-1-59 నుంచి మూడవజట్టుకి శిక్షణ ప్రారంభమవుతుంది.

చింతలపూడి ప్రభుత్వపట్టు కేంద్రం :- 23.96 యెకరాలలో మల్బరీచెట్లు నాటబడినవి. కానిఇందుకు యేర్పరచిన లక్ష్యంమాత్రం 50 యె. ఒక పంపు సెట్టు కొనబడింది. రీడింగు మెషినరీ కొనబడుతున్నది.

ఏలూరుకేంద్ర వున్ని కేంద్రం :- 1958-59 బడ్జెట్టు అంచనాలు కేటాయించబడిన రూ 19,000 తీసుకొనబడి ఏలూరువున్ని ఆదివాసీ నేత సహకార క్రయ విక్రయసంఘం లిమిటెడ్, ఏలూరుకి యివ్వబడింది.

తాడేపల్లి గూడెంలోని కుట్టుపనికేంద్రంలో 20 మంది శిక్షణ పొందుతున్నారు.

రాకపోకల సౌకర్యాలు :- దిగువ నాలుగుపనులు జరుగుతున్నాయి; అవి 31-3-59 నాటికి పూర్తి కాగలవని భావించబడుతున్నది.

1. పోతవరం-కొయ్యలగూడెంరోడ్డు :- నిర్మించని భాగాలనిర్మాణం, కంకరచేయని భాగాలకు కంకర;

2. పాలకొల్లు పామర్రురోడ్డు మై 59-3లో వంతెన పునర్నిర్మాణం;

3 జి. ఎన్. టి. రోడ్డుకి తారువేయుట;

4. మారుటేరునుంచి పిప్పరవరకూ కె. ఎన్. రోడ్డుకి తారువేయుట.

## గ్రామప్రణాళికలలో రోడ్డు

12 పనులు జరుగుతున్నాయి; ఒక్కటీ పూర్తి కాలేదు. ఇంతవరకూ పని మందంగా జరుగుటకు కారణం అధికవర్షాలు. ఖర్చువిషయంలో దీనివంతు లక్ష్యం రూ 23,600 కాగా యింతవరకూ రూ 24,000 ఖర్చు అయినవి. 31-3-59 కి పూర్వం పూర్తిగా కేటాయింపు ఖర్చు పెట్టబడగలదు.

వైద్యప్రణాళికలు :- వైద్యప్రణాళిక క్రింద దిగువ 13 పథకాలు అమలు పరచబడుతున్నాయి.

కాంపౌండర్ల శిక్షణ :- 21 మంది శిక్షణ పొందు తున్నారు.

మంత్రసానుల శిక్షణ ,- 25 మంది శిక్షణ పొందు తున్నారు.

ఏలూరు ప్రభుత్వ హెడ్ క్వార్టర్సు ఆస్పత్రి అభి వృద్ధిపనులు :- కొనసాగుతున్నాయి.

గోపాలపురం ప్రాథమిక ఆరోగ్యకేంద్రము, ఏలూరు కుటుంబనియంత్రణ క్లినిక్‌లు పనిచేస్తు న్నాయి; అలాగే నేత్రవైద్యక్లినిక్, చెవి, ముక్కు, గొంతుక్లినిక్కు, సు. వ్యా క్లినిక్కుకూడా. తణుకు కుష్ఠు వుపకేంద్రంకూడా పనిచేస్తున్నది.

సాంఘిక సంక్షేమపథకాలు :- "పారిశుద్ధ్య వసతులు," "ప్రభుత్వవసతి గృహనిర్వహణ," "గృహ వసతి," "ప్రచారం, ప్రచురణ" పథకాలక్రింద వరుసగా రూ 17,000 4,000, 2,820, 700 ఖర్చు మిగిలిపోయింది. వివిధ పథకాలక్రింద పూర్తి కేటాయింపులు 31-3-59కి పూర్వం ఖర్చు పెట్టబడగలవని ఆశించబడుతున్నది.

ప్రసారం :- 1958-59 లో యీజిల్లాలో 120 కమ్యూనిటీ రేడియోసెట్లను—84 యేలూరు సర్కిల్‌లోను, 36 రాజమండ్రి సర్కిల్‌లోను—నెలకొల్పాలని సంకల్పించబడింది. ఇంతవరకూ ఏలూరు సర్కిలులో 20 సెట్లు రాజమండ్రీ సర్కిలులో 7 సెట్లు నెలకొల్పబడ్డాయి.

ప్రజారోగ్యం :- దిగువపథకాలు అమలు పరచ బడుతున్నాయి.

1. దెందులూరులో ప్రాథమిక ఆరోగ్యకేంద్రం నడుపుట.

2. భీమడోలు, కొయ్యలగూడెం, ధర్మాజీ గూడెం, గోపాలపురాల ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలకి అనుబంధితమయిన గ్రామీణ కుటుంబనియంత్రణ క్లినిక్కును నడుపుట.

3. గ్రామీణ వెనుకబడిన ప్రాంతాలక్రింద ప్రసూతి, శిశుసంక్షేమకేంద్రం

4. ఏజన్సీ అభివృద్ధి పథకంక్రింద ప్రసూతి, శిశు సంక్షేమకేంద్రం.

5. భీమడోలు ప్రాథమిక ఆరోగ్యకేంద్రానికి అనుబంధితమయిన యునిసెఫ్ శకటం నిర్వహణ.

## విద్యావంతుల నిరుద్యోగసమస్య పరిష్కారం

ఈ పథకంక్రింద, విద్యావంతులకు వుద్యోగకల్పన చేయుటకై 18 కొత్తపాఠశాలల ప్రారంభానికై జిల్లా విద్యాధికారి వుత్తరువుచేశారు.

ఈ పథకంక్రింద కొవ్వూరు పంచాయతీ సమితి బ్లాకులో 20 మంది వుపాధ్యాయులు నియమించ బడ్డారు.

---

# పోలీసు గ్రామం

గ్రామాలు, గ్రామశివార్లలోని ప్రజలు 'పోలీసు' పేరు చెవితేచాలు భయపడి పోయిన రోజులు న్నాయి. ఇప్పటి పరిస్థితి అదికాదు — మహబూబు నగర్ జిల్లా దేవరకొండ మొదటిఅంచె బ్లాకులో బండరపల్లి గ్రామంలో పరిస్థితి అలా యెంతమాత్రం లేదు. అక్కడ, 'పోలీసుగ్రామం' పథకం ప్రవేశ పెట్టిన తరువాత గమనార్హమయిన ఫలితాలు చేకూరాయి. ఆగ్రామం స్వరూపమే పూర్తిగా మారి పోయింది; అంతేకాదు, ప్రజల దృక్పథంకూడా పూర్తిగా మారిపోయింది; ఇదివరలో పోలీసులంటే భయపడే ప్రజలకి యిప్పుడు వారిలో విశ్వాసంకుదిరి, వారి ప్రవర్తనపట్ల సంతృప్తి కలుగుతున్నది. పోలీసు సిబ్బందికి, గ్రామస్థులకి మధ్యగల భేదం సమసి పోయింది; యెందువల్లనంటే పోలీసులు ప్రజల అభి వృద్ధికై వారితోకలిసి పనిచేస్తున్నారు.

ఆగ్రామంలో అడుగుపెట్టిన యెవ్వరికయినా పెద్ద పెద్ద భవనాలు సౌందర్య విలసితమయిన వాటి నిర్మాణ పద్ధతి, విద్యుద్దీపాలు, మురుగు పారు దల, సక్రమ మయిన నీటి సరాఫరా పద్ధతులు మన స్సులో హత్తుకు పోతాయి; కల కల్లాడే గ్రామ స్థుల ముఖాలుచూస్తే వుత్సాహం కలుగుతుంది. బ్లాకు సిబ్బంది కాయకష్టంలో పోలీసుకానిస్టేబుళ్ల సహకారంపొంది జనసామాన్యం చిత్తవృత్తిలో మార్పు తెచ్చింది.

పోలీసు గ్రామంపథకం బండరపల్లిలో 26-12-57న మహబూబునగరం జిల్లా కలక్టరుచే ప్రారంభింప బడింది. బండరపల్లి హైదరాబాదు రాయచూరు రోడ్డు మీదనున్న దేవరకొండకు 3 మై. దూరంలో వుంది. అక్కడ 485 గృహాలు వున్నాయి; జనాభా 1300. ఈగ్రామం యెత్తయిన రాతి(బండ)పై వున్న దని, కాబట్టి దానికి "బండరపల్లి" అని పేరువచ్చిం దని అంటారు. ఇక్కడివారిలో అధికభాగం కాయ కష్టంచేస్తారు.

విరాళం ప్రాతిపదికపై యించుమించు రూ. 7,500 ఖర్చుపై కమ్యూనిటీ హాలు - పంచా యతీ హాలు నిర్మించబడింది. ఇంటికొక మనిషిచొప్పున పోలీసులతో కలసి శ్రమదానంలో పాల్గొనేవారు; ఇందునిమిత్తం వారంలో 3 రోజులు- శనివారాలు మంగళవారాలు, గురువారాలు- నిర్ణయించ బడ్డాయి. స్థలాన్ని పాఠశాలా భవనానికి సమీ పంలో గ్రామస్థులే యిచ్చారు. పోలీసులు యించు మించు 1500 అ. నిడివిగల మురుగు కాల్వను తవ్వారు; రాతికట్టడం పనిని గ్రామస్థులు విరాళం ప్రాతిపదికపై బ్లాకునిధులతో చేశారు.

ఇదివరలో ఆగ్రామంలో మంచినీటి బావిలేదు. గ్రామస్థులు అక్కడికి అరమైలు దూరంలోగల కాలువ నుంచి నీరు తెచ్చుకొనేవారు. గ్రామస్థులే ఒక బావిని త్రవ్వుకోలేదు.

30 మంది బాల బాలికలకి వ్యాయామ శిక్షణ యివ్వబడుతున్నది.

ఒక రాత్రి పాఠశాలను, భజనమండలిని స్వయంగా గ్రామస్థులే యెంతో సమర్థంగా నడుపుతున్నారు.

పొలం యెరువుల నిలవ విషయంలో రైతులు లోపభూయిష్టమైన పద్ధతిని అవలంబిస్తున్నారు. అందు వల్ల యెరువులోగల వృక్షాహారం చాలా పోతు

న్నది. అయితే అది కుళ్లవలసిన రీతిగా కుళ్లుటలేదు. ఈ విషయం రైతులకు చెప్పబడింది; ప్రమాణీకృత మయిన పెంట యెరువు గుంటలు త్రవ్వుకోమని సలహా యివ్వబడింది. వరి పొలాలకు పచ్చియెరువు వేయబడుతున్నది. రైతులందరూకూడా వరి పొలాలను వరుసగా నాటుతారు. గ్రామంలో ఒక కోళ్ల పెంపకం కేంద్రంకూడా యేర్పాటు చేయబడింది. ఒక వ్యవసాయ సహకార సంఘం వుంది.

సమాజాభివృద్ధి కార్యక్రమం ప్రవేశ పెట్టబడుట వల్ల యీ గ్రామంలో ఒకవిధంగా సాంఘిక, నైతిక సంఘీభావ మేర్పడింది. గ్రామీణులలో మానసిక మయిన మందకొండి తనాన్ని పారదోలి స్వయం కృషితో జీవన ప్రమాణాన్ని అభివృద్ధి చేసుకోవాలనే కోరికను కల్గించుటయే సమాజాభివృద్ధి మూల ప్రయోజనం. గ్రామస్థులు యీ పరియోజనాని కనుగుణంగా జీవిస్తున్నారు.



# గుంటూరు ప్రభుత్వ జనరల్ ఆస్పత్రి

గుంటూరు ప్రభుత్వ జనరల్ ఆస్పత్రి నూతన పరిపాలనా వ్యవహారాలబ్లాకు, మెడికల్ వార్డులు 24-1-59 న కేంద్ర ఆరోగ్యశాఖామంత్రిచే ప్రారంభించబడినవి. ఈఆస్పత్రి 1954 సెప్టెంబరుకి పూర్వం ప్రభుత్వ హెడ్ క్వార్టర్సుఆస్పత్రిఅని వ్యవహరింపబడేది. అది1848లో, మద్రాసుట్రంకురోడ్డుకి తూర్పున పెద్ద మసీదుకి సమీపంలో 6,350 చ. గజాలస్థలంలోగల పెంకుటింటిలో నెలకొల్పబడింది.

1861 లో యీభవనంస్థానే రూ 4,000 ఖర్చుపై అంతకంటె పెద్దభవంతి నిర్మించబడింది. ఈసొమ్ములో కొంతభాగాన్ని అక్కడ నివసించేయూరోపియనులు, భారతీయులు యిచ్చారు. ఈభవనంలో 12 పడకలు (7 పురుషులకు, 5 స్త్రీలకు) వుండేవి.

ఒక దశాబ్దితరువాత 1871 లో యీఆస్పత్రి గుంటూరు మునిసిపాలిటీకి అప్పగించబడింది. 1877 లో వసతిని పెంచుటకై 2 పూరి షెడ్డులు నిర్మించ బడ్డాయి. 1860 లో 4 పడకలుగల Lying-in వార్డు నిర్మించబడింది.

1844 లో పూరిషెడ్డులస్థానే పెంకుటిభవంతి నిర్మించబడింది; అక్కడ 9 సాధారణ ప్రయోజన పడకలు, కొన్ని ప్రత్యేక ప్రయోజనపడకలువుండేవి. తరువాత క్రమేణా పడకలసంఖ్య 40 కి హెచ్చేవరకూ వసతి పెంచబడింది. ఉన్నస్థలమంతా భవన నిర్మాణానికి వినియోగించబడింది.

సువిశాలమయిన ఆస్పత్రిని నిర్మించాలని 1894 లో కొలనెల్ బన్నెరమాన్, 1908లో సర్ ఆర్థర్ లాలీ పునః పునః చేసిన సిఫార్సుల ఫలితంగా 8 యెకరాల 64 సెంట్లుగల ప్రస్తుతస్థలం సంపాదించబడి రూ 1,81,790 తో 90 పడకలుగల ఆస్పత్రి



మెడికల్ వార్డు



జనరల్ ఆస్పత్రి అడ్మినిస్ట్రేటివ్ బ్లాకు

నిర్మించబడింది. 1915లో పెంట్లాండు ప్రభువు యీ భవనానికి శంకుస్థాపన చేశారు.

1930లో, స్వర్గీయ పానగల్లురాజా ముఖ్యమంత్రిగా వున్నప్పుడు కొత్త ఔట్ పేషెంటుబ్లాకు నిర్మించబడింది. 1933 లో 100 పడకలుగల రెండంతస్థుల భవనం నిర్మించబడింది. ఆతరువాత జరిగిన మరికొన్ని చేర్పులతో మొత్తంవసతి 225 కి హెచ్చింది.

1954 సెప్టెంబరులో పడకలసంఖ్య 350 కి హెచ్చింది. అప్పటినుంచి వెనుకటి హెడ్ క్వార్టర్సు ఆస్పత్రి బోధనా ఆస్పత్రిగామారి గుంటూరు ప్రభుత్వజనరలు ఆస్పత్రి అని వ్యవహరింపబడుతున్నది. అక్కడ అండర్ గ్రాడ్యుయేటు, పోస్టు గ్రాడ్యుయేటు బోధనలు రెండిటికి వసతివుంది. 1954 లో ప్రభుత్వం ప్రస్తుతఆస్పత్రికి ప్రక్కనగల 9 యె. భూమిని సంపాదించింది, దిగువ సౌకర్యాల కల్పనకై రమారమి రూ 50 లక్షల ఖర్చుపై భవన నిర్మాణ కార్యక్రమం మంజూరు చేయబడింది.

1. అదనంగా 400 పడకలు—30 ప్రత్యేకవార్డు పడకలతోసహా.

2. ఆధునిక ఔట్ పేషెంటుశాఖ.

3. నర్సింగు పాఠశాల—250 మంది నర్సులకు నివాసగృహాలతో.

4. 'ఇంటర్ని' విద్యార్థులకు, హౌస్ సర్జన్‌లకు నివాసగృహాలు.

5. రెండు ఇంటశస్త్ర చికిత్సాసదనాలు.

6 స్టీమ్‌లాండ్రీ.

7. ఆధునికరకం మార్చ్యుయరీ.

వాటిలో కొన్ని యిప్పటికే పూర్తి అయినవి. మిగిలినవి యింకమించు 6 నెలల్లో పూర్తి కాగలవని భావించబడుతున్నది. 1956 డిశంబరులో గుంటూరు వైద్యకళాశాలాశాఖ కమిటీ 40 పడకల పేడియాట్రిక్ బ్లాకు నిర్మాణానికై రూ 75,000 విరాళమిచ్చింది భవనం నిర్మించబడుతున్నది; రెండు మూడు నెలల్లో అప్పగించబడగలదని భావించబడుతున్నది.

1958 అక్టోబరులో ప్రభుత్వం ఆస్పత్రిలో పడకలసంఖ్యను 600 కి హెచ్చించింది.

1925 నుంచి యీఆస్పత్రి విద్యార్థినర్సులు, మంత్రసానులు, కాంపౌండర్లకి శిక్షణాపాఠశాలగా

కూడా పనిచేస్తున్నది. 1954 నుంచి యిక్కడ సహాయనర్సు మంత్రసానులకుకూడా శిక్షణ యివ్వ బడుతున్నది.

1954 నుంచి యీ ఆస్పత్రికివచ్చి చికిత్సపొందే వారిసంఖ్య క్రమేణా హెచ్చుతున్నది. వివరాలు దిగువ యివ్వబడినవి .-

| సంవత్సరం | రోజూ ఆస్పత్రిలో వుండే రోగుల సగటు | రోజూ ఆస్పత్రికి వచ్చి మందు తీసుకొని వెళ్లే రోగుల సగటు |
|---|---|---|
| 1954 | 420 | 694 |
| 1955 | 504 | 902 |
| 1956 | 472 | 1371 |
| 1957 | 510 | 1402 |
| 1958 | 525 | 1726 |

ప్రస్తుతం యీ ఆస్పత్రిలో దిగువశాఖలు వున్నాయి.

శస్త్ర చికిత్సశాఖ—30 యూనిట్లు; వైద్యశాఖ 3 యూనిట్లు; ప్రసూతి; స్త్రీశాస్త్ర శాఖ—2 యూనిట్లు, నేత్రచికిత్సశాఖ, చెవి, ముక్కు, గొంతు వ్యాధులశాఖ; అర్థోపెడిక్ శాఖ పేడియాట్రిక్ శాఖ; సుఖవ్యాధులశాఖ, చర్మవైద్య; కుష్ఠుశాఖ; క్షయ శాఖ; దంతవైద్య శస్త్రచికిత్సశాఖ; రేడియోలజీ శాఖ; అనేస్థిసియాశాఖ; రక్తం బ్యాంకిశాఖ; ఉరము సంబంధమయిన శస్త్రచికిత్సశాఖ; కుటుంబ నియంత్రిణ క్లినిక్ శాఖ; ప్లాస్టిక్ సర్జరీశాఖ'



మెడికల్ వార్డు లోపల దృశ్యం.

# చిత్తూరు

## భౌగోళిక విషయాలు

కడప, వుత్తరార్కాటు జిల్లాలనుంచి తీసుకొనబడిన కొన్ని తాలూకాలతో చిత్తూరుజిల్లా 1911లో యేర్పరుచబడింది వుంది దానికి వుత్తరాన అనంతపురం, కడప, నెల్లూరు జిల్లాలు, తూర్పున చెంగల్పట్టు జిల్లా, దక్షిణాన వుత్తరార్కాటు జిల్లా, పశ్చిమాన మైసూరు రాష్ట్రం వున్నాయి

ఈ జిల్లాలోగల 2 రెవిన్యూ డివిజన్లు 9 తాలూకాలుగా విభజించబడినవి వాటిలో 4 తాలూకాలు యిటీవలివరకూ జమీందారీ ప్రాంతాలుగా వుండేవి అవి మద్రాసు జమీందారీల రద్దు చట్టంక్రింద ప్రభుత్వంచే స్వాధీనం చేసుకొనబడినవి స్వాధీనం చేసుకోబడిన ప్రాంతాలు యిద్దరు డిప్యూటీ కలక్టరు మేనేజర్లు, యిద్దరు తహసీల్దారు మేనేజర్ల పరిపాలనాధికారంక్రింద వున్నాయి డి క మేనేజర్ల ముఖ్య కార్యాలయాలు కాళహస్తి, తిరుత్తనిలలోను, త మేనేజర్ల ముఖ్య కార్యాలయాలు చిత్తూరు, కుప్పంలలోను వున్నాయి రైత్వారీ డివిజన్లు చంద్రగిరి, మదనపల్లిలలోని రెవిన్యూ డివిజనల్ అధికార్ల అధ్వర్యంలో వున్నాయి



శ్రీ ఎమ్ అనంతశయనం అయ్యంగార్, పా స, లోకసభ అధ్యక్షుడు (చిత్తూరు నియోజకవర్గం)



శ్రీ డి. రామబ్రహ్మం, శా.స.స. (కుప్పం నియోజకవర్గం)

ఈ జిల్లాను (1) కొండలు, మెట్టప్రాంతాలుగాను (2) మైదానాలుగాను విభజించవచ్చు. తూర్పు కనుమలు యీ జిల్లా నైఋతి దిశనుంచి ఈశాన్యదిశకు వ్యాపించివున్నాయి నైఋతి దిశను కన్గొండినుంచి ఆరంభమయి అవి పలమనేరు తాలూకా, పుంగనూరు తాలూకా తూర్పుభాగం మీదుగా ఈశాన్యదిశగా వ్యాపించి అటుపిమ్మట తూర్పుగా తిరిగి చిత్తూరు, చంద్రగిరి తాలూకాలమీదుగా తిరుపతివరకూ వ్యాపిస్తాయి తిరుపతికావల యీ శ్రేణి మామండూరు లోయ అనే పెద్ద లోయతో తెగిపోతుంది, యీ



శ్రీ పి. గోపాలరెడ్డి, శా. స. స., (తిరుత్తని).

కనుమలు ఈశాన్యదిశగా కాళహస్తి తాలూకాను స్పృశిస్తూ పోయి నెల్లూరు జిల్లాలో ప్రవేశిస్తాయి. కనుమలకి పడమర పుంగనూరు, మదనపల్లి, వాయల్పాడు తాలూకాలోని ప్రదేశం 2,000' నుంచి 2,500 యెత్తుగల పీఠభూమి. ఇది మైసూరు పీఠభూమితో కలిసివుంది. పీఠభూమి తాలూకాలయిన మదనపల్లి, పుంగనూరు, వాయల్పాడులలోను, తూర్పు తాలూకాలయిన కాళహస్తి, పుత్తూరు, తిరుత్తనిలలోను అనేకమయిన చిన్నచిన్న కొండలు వున్నాయి. మదనపల్లి తాలూకాలోని హార్స్లీ కొండలు, పుత్తూరు తాలూకాలోని నగరికొండలు వాటిలో మిక్కిలి ముఖ్యమయినవి.

ఈ జిల్లా వుత్తర భాగంలో వుత్తరముఖంగా ప్రవహించేనదులు కొన్ని, దక్షిణభాగంలో దక్షిణ, తూర్పుముఖాలుగా ప్రవహించే నదులు కొన్ని వున్నాయి. జీవనదులు లేవు. ఈ జిల్లాలో ప్రవహించే కొన్ని ముఖ్యమయిన నదులు యివి: పాపాఘ్ని, పించ, కౌండిన్య, పాలారు, పోయ్‌నీ, అరణి, స్వర్ణముఖి. ఈ నదులన్నీ సంవత్సరంలో చాలభాగం యెండిపోయి వుంటాయి. వర్షాకాలంలో మాత్రమే వాటిలో నీరు వుంటుంది.

## విస్తీర్ణం, జనాభా

ఈ జిల్లా విస్తీర్ణం 5,890 చ. మైళ్లు. జనసంఖ్య 18,10,377. ఇందులో చిత్తూరు, తిరుపతి మునిసిపాలిటీల జనాభా వరుసగా 38,894,25,207. 1951 జనాభా లెక్కలప్రకారం అక్షరాస్యుల మొత్తం సంఖ్య 1,80,404. అంటే 10 శాతం అన్నమాట. ఈ జిల్లాలో 2 వ తరగతి మునిసిపాలిటీలు 2, మొదటి తరగతి పంచాయితీలు 11, రెండవ తరగతి పంచాయతీలు 998 వున్నాయి. మొత్తం విస్తీర్ణం 37,69,290 యెకరాలలోను 9,43,917 యెకరాలు అడవులు, 6,71,105 యెకరాలు సాగులాయకుకాని భూమి, 4,01,065 యె. సాగులాయకయిన బంజరుభూమి, పంటలక్రిందగల నికరం భూమి 9,77,113 యె. (1956-57 లెక్కల ప్రకారం).

ఈజిల్లాలో శాసనసభ నియోజకవర్గాలు 14 వున్నాయి. వీటికి నుంచి 17 మంది ప్రతినిధులు యెన్నుకొన బడతారు. ఒక ద్విసభ్య పార్లమెంటు నియోజకవర్గం వుంది.

## శీతోష్ణస్థితి, వర్షపాతము

ఈజిల్లా శీతోష్ణస్థితి పొడిగావుంటుంది. సర్వ సాధారణంగా ఆరోగ్యకర మయినది. ఈజిల్లాలో మెరక



శ్రీ ఎన్. ఎమ్. విల్లియం, శా. మం. స., (శాసనసభ సభ్యులచే యెన్నికయినవారు).



రాజా వీరబసవచిక్కరాయలు, బై. బి., శా. స. స., (పుంగనూరు).

ప్రాంతాలయిన పలమనేరు, పుంగనూరు, మదనపల్లి తాలూకాలలో మిగిలిన ప్రదేశంలోకంటే చల్లగా వుంటుంది. హార్సిలేకొండను (4100) వేసవి కేంద్రంగా అభివృద్ధిపరచుటకు ప్రతిపాదనలు వున్నాయి. ఈపనిని ఒకటి రెండు సంవత్సరాలలో పూర్తి చేయుటకై చర్య గైకొనబడుతున్నది. ఈజిల్లాలో ఈశాన్య, నైఋతి ఋతుపవనాలు రెండిటివల్లా వర్షం కురుస్తుంది. పీఠభూమి తాలూకాలయిన మదనపల్లి, వాయల్పాడు, పలమనేరులలో నైఋతి ఋతుపవనాలవల్ల (అక్టోబరునుంచి డిసెంబరువరకు) యెక్కువ వర్షం కురుస్తుంది. భారీ నీటిపారుదల ప్రాజెక్టులు లేనందునా, ఎర్రనేల స్వభావరీత్యా తేమను నిలిపి వుంచుకోలేనందువల్లా జూను, సెప్టెంబరులమధ్య వర్షాలు పడకపోతే యీజిల్లా కరువు పరిస్థితులకు లోనవుతుంది. జిల్లాసగటు వర్షపాతం 33.81.

## భూమిరకాలు, పంటలు

ఈ జిల్లాప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయం. ఆతరువాత చేనేతపరిశ్రమ చాలకుటుంబాలను పోషిస్తుంది.

ఇక్కడ నల్లరేగడ, ఎర్ర, మిశ్రమరకాల భూములున్నాయి. రేగడభూముల్లో ఎక్కువ బంకమట్టి భూములు, బురదనేలలు, యిసుకనేలలు అని మూడు రకాలున్నాయి. జిల్లాలో యెక్కువ ప్రాంతం ఎర్రమట్టినేలలు. ఈజిల్లాలో కమతాలసగటు ప్రమాణం 3.19 యెకరాలు. అసెస్మెంటు రూ 4-9-4.

ఇక్కడ ముఖ్యమయిన ఆహార పంటలు వరి, రాగి, సజ్జ, జొన్న, వరగు, సామలు పరిమిత ప్రదేశాలలో పండించబడతాయి. మామూలుగా జూలై నుంచి అక్టోబరువరకూ మంచివర్షాలు కురుస్తాయి కాబట్టి అదే వ్యవసాయం పనులకు తగినకాలం. చెఱకు, వేరుసెనగ యీజిల్లాలో ముఖ్యమయిన వాణిజ్యపంటలు. ఈజిల్లాలో ప్రస్తుతం పంచదార ఫ్యాక్టరీ లేనందున చెఱకుతో పాతపద్ధతులలో బెల్లం తయారు చేయబడుతున్నది. ఇప్పుడు సహకార ప్రాతిపదికపై పంచదార ఫ్యాక్టరీ స్థాపనను ప్రభుత్వం మంజూరుచేసింది; ఆఫ్యాక్టరీని త్వరలో ప్రారంభించుటకై చర్య గైకొనబడుతున్నది. ఈ జిల్లాలో



శ్రీ కె. ఆదికేశవులునాయుడు, శా. మం. స. (స్థానిక అధికారిసంస్థల నియోజకవర్గం, రాయలసీమ).

ప్రపంచ ప్రసిద్ధమయిన మామిడిచెట్లు, చింతచెట్లు పుష్కలంగా వున్నాయి. మామిడిపళ్లు యేటా (ఏప్రిల్ - మే-జూన్ నెలల్లో) బొంబాయికి అక్కడి నుంచి పశ్చిమదేశాలకి, దేశంలోని యితర రాష్ట్రాలకి కూడా యెగుమతి చేయబడతాయి.

ప్రపంచ ప్రసిద్ధిగాంచిన పుంగనూరు జాతిఆవులు పలమనేరులోని ప్రభుత్వ పశుగణాభివృద్ధి క్షేత్రంలో అభివృద్ధి పరచబడుతున్నాయి. పలమనేరు చిత్తూరుకి 25 మైళ్ళ దూరంలోవుంది.

## పరిశ్రమలు

వర్షాధారమయిన యీజిల్లా ఆర్థికాభివృద్ధి ఒక్క నీటిపారుదల ప్రాజెక్టులమీదనేకాక పారిశ్రామిక వనరుల అభివృద్ధిపై కూడా ఆధారపడివుంది. కుప్పం, తిరుపతి, చిత్తూరులు యీజిల్లా భారీపారిశ్రామిక ప్రదేశాలుగా వున్నాయి. అక్కడ పెద్దతరహా పారిశ్రామిక కేంద్రాలు పనిచేస్తున్నాయి.

ఈజిల్లాలో 3తరగతుల పరిశ్రమలు వున్నాయి అవియివి :—

I భారీపరిశ్రమలు : అట్టిపరిశ్రమలు 3 వున్నాయి. ఒక్కొక్కదాని పెట్టుబడి రూ 30,00,000 మించుతుంది. అవి యివి : (1) తిరుపతి నూలుమిల్లులు, రేణిగుంట (2) త్వరలో ప్రారంభింప సంకల్పించ బడిన సహకార పంచదార ఫ్యాక్టరీ, చిత్తూరు (3) గోవర్ధన్ బంగారుగనులు, నారాయణనగర్.

II చిన్నతరహా పరిశ్రమలు : అట్టి పరిశ్రమలు 5 వున్నాయి. ఒక్కొక్కదాని విషయంలో పెట్టుబడి యించుమించు రూ 5 లక్షలు. ఆ పరిశ్రమల వివరాలు యివి : 1. ఎమ్. ఎస్. వెజిటాల్స్ లిమిటెడ్, చిత్తూరు 2. కంగుండి ఇండస్ట్రియల్స్, కుప్పం. 3. సౌత్ఇండియన్ ఇండస్ట్రియల్ వర్క్సు, కుప్పం 4. ఈస్టిఇండియన్ మంచిగంధపునూనె డిస్టలర్సు, కుప్పం, 5. సౌత్ఇండియన్ మంచిగంధపునూనె డిస్టిలర్సు, కుప్పం.



శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు, శా.స.స. (వడమలపేట)

## సహకార ప్రాతిపదిక పరిశ్రమలు

ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికల క్రింద ముఖ్యంగా సహకార ప్రాతిపదికపై యీజిల్లా పారిశ్రామికాభివృద్ధికి పథకం తయారు చేయబడింది. దిగువ పారిశ్రామిక పథకాలు చేపట్టబడ్డాయి.

1. తిరుపతి వెంకటేశ్వర కాగితంమిల్లులు: ప్రస్తుత భవనాల మరమ్మతుకి, నూతన భవనాల నిర్మాణానికి రూ 10.35 లక్షలు మంజూరు చేయబడ్డాయి.

2. చిత్తూరు సంచార వడ్రంగం యూనిట్టు : ఇందునిమిత్తం రూ 50,000 కేటాయించ బడ్డాయి. వాన్ ఒకటి కొనబడింది; పరికరాలు అమర్చబడుతున్నాయి.

3. రేణిగుంట గాజుపూసల శిక్షణ—వుత్పత్తి యూనిట్టు : ఇంతవరకు ఆరుగురు చేతిపని వారికి శిక్షణ యివ్వబడింది. కాళహస్తి తాలూకా పాపానాయుడుపేటలో సహకార ప్రాతిపదికపై గాజు పూసల తయారీలో ప్రైవేటు వ్యక్తులు కూడా పాల్గొంటున్నారు.



శ్రీ పి. తిమ్మారెడ్డి, వ్యవసాయశాఖామంత్రి, (వాయల్పాడు).

4. బెల్లం, ఖండసరి పథకం : రూ 62,000 కేటాయించ బడ్డాయి. ఈపథకం చిత్తూరు తాలూకా ఆరగొండ, ఈరాల, నలగంపల్లి, యాదమరిలలో అమలు జరుప బడుతున్నది.

5. తిరుచానూరులో బొమ్మల తయారీ-శిక్షణా కేంద్రం : రూ 13,000 మంజూరు చేయబడ్డాయి. ఆరుగురు చేతిపని వారికి శిక్షణ యివ్వబడుతున్నది.

6. డ్రిల్లర్లు, సహాయ డ్రిల్లర్ల శిక్షణ : ఈపథకం రాష్ట్రి ప్రాతిపదికపై పరిశ్రమలు, వాణిజ్యశాఖ డైరెక్టరుచే అమలు జరుపబడుతున్నది.

7. పలమనేరు సెరీ కల్చరు క్షేత్రం : ఈపరిశ్రమ కుటీర పరిశ్రమగా అభివృద్ధి పరుపబడుతున్నది.

ఈజిల్లాలో దిగువ 5 పారిశ్రామిక సహకార సంఘాలుకూడా యేర్పాటు చేయబడినవి.

1. దువ్వెనల తయారీ సహకార సంఘం, నేరాబిలు.
2. ఖర్జూరచాపలఅల్లకందార్ల సహకార సంఘం, సంగసముద్రం.
3. తోలు వస్తువుల తయారీ సహకార సంఘం, గుర్రంకొండ.
4. అగరువత్తుల తయారీ సహకార సంఘం, గుర్రంకొండ.
5. సమాజాభివృద్ధి కుటీర పరిశ్రమల సంఘం, వాయల్పాడు.

ఈ జిల్లా తూర్పు తాలూకాలలో చేనేత పరిశ్రమ విస్తృతంగా జరుగుతుంది. ఇది వ్యవసాయం తరువాత ప్రముఖ స్థానం ఆక్రమిస్తుందని చెప్పవచ్చు.

## చిన్న పరిశ్రమలు

ఈ జిల్లాలో దిగువ యితర పరిశ్రమలు కూడా చిన్న యెత్తున కొనసాగుతున్నాయి.

నూలు వడకుట, పీచు తయారీ, లక్కపని, మంచి గంధపు తిరుగళ్ల తయారీ, వెదురుపని, కొయ్యదువ్వెనలు, ఉక్కు పెట్టెలు, బాల్చీలు, కంచుపనులు, ఇంజన్ల మరమ్మతు సంస్థలు, బేకరీ, మిఠాయిల తయారీ, అగ్గిపెట్టెల తయారీ, ముద్రణ, బైండింగు, తోలుపదును వగైరా.

చిత్తూరులో న్యూట్రిన్ కాన్ఫెక్షనరీఅనే ప్రైవేటు సంస్థకూడా పని చేస్తున్నది.

ఖనిజాలు : ఈ జిల్లా ఖనిజసంపద విషయంలో పూర్తి పరిశోధనలు జరుగలేదు. ఇప్పుడు కాళహస్తి తాలూకా సీరసోవాంబేడులో త్రవ్వబడే ముడియినుం మిక్కిలి ముఖ్యమయిన ఖనిజం. ఈ జిల్లాలో ఒక దినుసు స్ఫటికము, బంగారము, అభ్రికము. భవన నిర్మాణ వస్తువులు కూడా లభిస్తాయి.

రాకపోకల సౌకర్యాలు : ఈ జిల్లాలో 68-1/4 మైళ్ల మీటర్ గేజ్ రైలుమార్గం వుంది. మద్రాసు-

బొంబాయి (బ్రాడ్‌గేజ్) మార్గం తిరుత్తని, పుత్తూరు, చంద్రగిరి తాలూకాల మీదుగా పోతుంది. మద్రాసు-బెంగుళూరు (బ్రాడ్‌గేజ్) మార్గం పలమనేరు తాలూకా దక్షిణపు వార ప్రవేశిస్తుంది. కాట్పాడినుంచి వచ్చే మీటర్ గేజ్ మార్గం గూడూరుతో కలుపుతుంది. రేణిగుంట-గూడూరు మార్గం బ్రాడ్‌గేజ్‌గా మార్చబడింది. పాకాలనుంచి ఆరంభమయే మీటర్‌గేజ్ మార్గం గుంతకల్లు-బెంగుళూరు మార్గంమీద ధర్మవరాన్ని కలుపుతుంది. ఈ మార్గం చంద్రగిరి, పుంగనూరు, వాయల్పాడు, మదనపల్లి తాలూకాలమీదుగా పోతుంది. జిల్లా ముఖ్యపట్నం చిత్తూరు, తాలూకా ముఖ్యపట్నాలయిన వాయల్పాడు, చంద్రగిరి, కాళహస్తి, పుత్తూరు, తిరుత్తనిలు రైలుమార్గంమీద వున్నాయి.

ఈ జిల్లారోడ్లు పక్క జిల్లాలకు, మద్రాసు, మైసూరు రాష్ట్రాలకు వెడతాయి. 43 మైళ్ల మునిసిపలు రోడ్లతోసహా యీ జిల్లాలో 1,728 మైళ్ల రోడ్లు వున్నాయి. నేల గట్టిది కావడంవల్లనూ, కావలసినంత మంచిరకం కంకర లభించుటవల్లనూ యీ జిల్లా రోడ్ల పరిస్థితి మొత్తంమీద బాగుంటుంది.

తంతి, తపాలా సౌకర్యాలు : చిత్తూరు, కడప రెవిన్యూ జిల్లాలతో చిత్తూరు తపాల కార్యాలయాల మండలం 364 తపాల కార్యాలయాలతో 26-1-55 న యేర్పాటు చేయబడింది. 1955-56 నుంచి 1957-58 వరకూ చిత్తూరు మండలం యెంత శీఘ్రంగా అభివృద్ధి చెందిందంటే, 25-2-57 నుంచి కడప రెవిన్యూ జిల్లాకు విడిగా తపాల మండలం యేర్పడే అర్హత కలిగింది. అప్పుడు చిత్తూరు మండలం ఒకే ఒక జిల్లాకి తగ్గిపోయింది. దిగువ పట్టీలో యీ జిల్లాలో తపాల సౌకర్యాల ప్రస్తుతపరిస్థితి వివరాలు యివ్వబడినవి :—



శ్రీ ఎమ్. దొరైకన్ను, శా. స. స. (తిరుత్తని).

## సాధించిన ఫలితాలు

| సంవత్సరం | తపాల కార్యాలయాల లక్ష్యం | తెరువబడిన తపాల కార్యాలయాల సంఖ్య | సంవత్సరాంతానికి మొత్తంసంఖ్య | తపాల సౌకర్యాలు | టెలిఫోన్ సౌకర్యాలు | ఎస్. బి. ఎస్. ఎస్. సి పనులు |
|---|---|---|---|---|---|---|
| 1955—56 | 30 | 43 | 420 | 23 | 17 | 65 |
| 1956—57 | 50 | 62 | 482 | 27 | 17 | 65 |
| 1957—58 | 50 | 54 | 536 | 27 | 17 | 65 |



శ్రీ టి. ఎన్. విశ్వనాధరెడ్డి, పా. స., (రాజంపేట)

నీటిపారుదల ప్రాజెక్టులు: తొలి పంచవర్ష ప్రణాళికలో రూ 5,11,810 ఖర్చుతో 51 ప్రత్యేక చిన్నతరహా నీటిపారుదలపనులు మరమ్మతు చేయబడినవి. వాటివల్ల 8,371 యెకరాలకి లాభించింది.

## మధ్యరకం ప్రాజెక్టులు

1. కాళహస్తితాలూకా స్వర్ణముఖి: ఈ పథకం తొలి ప్రణాళిక కాలంలో చేపట్టబడి 1956 లో పూర్తి చేయబడింది. దీనిఖర్చు రూ. 10.52 లక్షలు. దీనివల్ల 10,342 ఎకరాలకి లాభించాలి. సిద్దలగండి, కాళంగి, మల్లిమడుగు ప్రాజెక్టులు యీ సంవత్సరం (1958) ద్వితీయ ప్రణాళికక్రింద కొనసాగుతున్నాయి.

2. సిద్ధలగండి: అంచనావ్యయం రూ. 3,00,000 లోను యింతవరకూ రూ 5,83,000 ఖర్చు పెట్టబడ్డాయి. ఇది మొదట అనుకున్న ప్రకారం 1958 జూన్‌నాటికి పూర్తిచేయబడింది. ఈ పథకంవల్ల కొత్తగా 350 యెకరాలకి లాభిస్తుంది.

3. కాళంగి:- మొట్టమొదటి అంచనాఖర్చు రూ. 14,65,000. ఇందులో యింతవరకూ రూ. 21,50,000 ఖర్చు పెట్టబడ్డాయి. ఈ ప్రాజెక్టు క్రింద 4,574 యెకరాలకి లాభించాలి.

4. మల్లిమడుగు:- ఇంతవరకూ రూ19,63,000 ఖర్చు చేయబడ్డాయి. ప్రస్తుతం వున్న 15 చెరువులికి నీరు సరఫరా చేయుటకై యిది వుద్దేశించబడింది. ఇందువల్ల 3,988 యెకరాలకి నీటి పారుదల లభిస్తుంది.

ఇవికాక దిగువ పనులనుకూడా చేపట్టాలని సంకల్పించబడింది. రూ. 21,900 అంచనా ఖర్చుపై చియ్యవరంచెరువు; రూ 4,400 అంచనా ఖర్చుపై అయ్యపురెడ్డిచెరువు కాలువ అగ్రభాగాన ఆనకట్ట; రూ 57,500 అంచనా ఖర్చుపై వెంకటరాయని చెరువు; రూ. 24,100 అంచనా ఖర్చుపై పాలారు నదిపై గిరివాసియా ఒడ్డువాగు; మొత్తం రూ. 5,55,000 ఖర్చుపై 15 ప్రత్యేక చిన్నతరహా నీటిపారుదలపనులు. మదనపల్లి, చంద్రగిరి తాలూకాలలో జరిగేసంవత్సరంలో రెండు కొత్త పథకాలను చేపట్టాలనికూడా సంకల్పించబడింది. ఒక్కొక్క పథకంఖర్చు రూ. 10,00,000.

విద్య:- శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం శ్రీ వెంకటేశ్వరస్వామికి నిలయమయిన తిరుపతిలో యేర్పాటు చేయబడింది. ప్రస్తుతం యీజిల్లాలో



శ్రీ ఎస్. గోవిందరాజులు, శా.మం.స., (నామినేటెడ్).

సాంకేతిక విద్యాసంస్థలతోసహా తగినన్ని విద్యాసంస్థలున్నాయి. వివరాలు యివి :

| | |
|---|---|
| ఆర్ట్సు సైన్సుకళాశాలలు | 4 |
| సాంకేతిక విద్యాసంస్థలు | 3 |
| ఉన్నత పాఠశాలలు | 33 |
| శిక్షణపాఠశాలలు (మామూలివి) | 2 |
| శిక్షణపాఠశాలలు (ప్రాతిపదిక) | 1 |
| వయోజనపాఠశాలలు | 204 |
| మాధ్యమిక పాఠశాలలు | 9 |
| ప్రాథమికోన్నతపాఠశాలలు | 82 |
| ప్రాథమిక పాఠశాలలు | 1696 |

ఇవికాక కాళహస్తిలో రెండు షిఫ్టుల విస్తరణ శిక్షణాకేంద్రం, తిరుపతిలో బ్లాకుస్థాయి సహకార అధికారుల శిక్షణాకేంద్రము పని చేస్తున్నాయి.

## ప్రజారోగ్యం

1958 మార్చి నెలాఖరు వరకూ యీశాఖ అమలు పరచిన పథకాలు యివి :—

1. పరిసరాల పారిశుద్ధ్యం.
2. ప్రసూతి, శిశుసంక్షేమ పథకాలు.
3. ఆహారం, పౌష్టికాహారం.
4. అంటువ్యాధుల నిరోధం.
5. కుష్ఠు.
6. ఆరోగ్య విద్యాబోధన.

1958-59లో రూ. 15,134 ఖర్చుపై దిగువ 2 పథకాలు అమలులో వున్నాయి.

1. ప్రసూతి, శిశుసంక్షేమ కేంద్రాలలో దాయాల శిక్షణ.

2. ఆరోగ్య ప్రచారం, ప్రచురణ.

వైద్యసహాయం : ప్రతితాలూకా ముఖ్యపట్నంలోను ఆస్పత్రివుంది. అవి ప్రభుత్వపరం చేయబడినవి. ఫిర్కా ముఖ్యపట్నాలలో పెక్కింటికి జిల్లాబోర్డు గ్రామీణ ఔషధశాలలు వుపకరిస్తాయి. 3 ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు కూడా వున్నాయి.

1958 మార్చివరకూ యీ శాఖదిగువ పనులను సాధించినది:



శ్రీ టి. గోపాలకృష్ణగుప్త, శా. స. స., (మదనపల్లి).

1 చిత్తూరు ప్రభుత్వ హెడ్ క్వార్టర్సు ఆస్పత్రిలో పడకల సంఖ్యను 95 నుంచి 125 కి హెచ్చింపు.
2 అదనపు కాంపౌండర్లు, మంత్రసానుల శిక్షణ.
3 సెప్టిక్ టాంకురకం మరుగుదొడ్ల నిర్మాణం.
4 చిత్తూరు హెడ్ క్వార్టర్సు ఆస్పత్రిలో దంతవైద్య విభాగం స్థాపన.
5 క్షయవ్యాధి క్లినిక్ ప్రారంభం
6 కుటుంబ నియంత్రణ క్లినిక్ ప్రారంభం
7 పిల్లల వార్డు నిర్మాణం
8 ఎక్స్‌రే బ్లాకు స్థాపన
9 సంచార వైద్య యూనిట్టు ప్రారంభం

(5–9: చిత్తూరు ప్రభుత్వ హెడ్ క్వార్టర్సు ఆస్పత్రిలో)

10 పులిచెర్లలో ప్రాథమిక ఆరోగ్యకేంద్రం స్థాపన.

పై పథకాలపై రూ. 3,52,644/- ఖర్చు పెట్టబడింది. 1958-59 లో రూ. 1,71,652 ఖర్చుపై 14 పథకాలు చేపట్టబడ్డాయి.

## విద్యుచ్ఛక్తి

1958 మార్చివరకూ యీ జిల్లాలో విద్యుచ్ఛక్తి దిగువ విధంగా విస్తరింప చేయబడింది.

| | |
|---|---|
| 66 కె. వి. ప్రసార మార్గాలు | 92 మైళ్లు |
| 33 కె. వి. ప్రసార మార్గాలు | 140 ,, |



శ్రీ ఎస్. పి. చెంగల్రాయనాయుడు, శా. స. స. (వేపంజేరి).

విద్యుచ్ఛక్తి సరఫరాచేసిన గ్రామాల

| | | |
|---|---|---|
| సంఖ్య | 171 | ,, |
| వ్యవసాయ పంపుసెట్లకిచ్చిన కనెక్షన్లు | 1051 | ,, |
| పారిశ్రామిక సర్వీసులు | 103 | ,, |
| హైటెన్షన్ | 7 | ,, |
| గృహ వాడకాలు | 5013 | ,, |

1958-59లో రూ. 24,33,100 ఖర్చుపై 20 పథకాలు చేపట్టబడినవి.

స్త్రీసంక్షేమం : 1957-58 వరకూ యీజిల్లాలో 5 స్త్రీసంక్షేమ కేంద్రాలు ప్రారంభింప బడ్డాయి. సహాయస్త్రీ సంక్షేమాధికారి యీశాఖకి అధ్వర్యం వహిస్తోంది.

## దర్శనీయమయిన స్థలాలు

1. మదనపల్లి క్షయ ఆరోగ్య సదనం : దీనికి ఆరోగ్య వనమనే పేరుకూడావుంది. ఇది మదనపల్లి పట్టణం, మదనపల్లి రోడ్డు రైలుస్టేషనులమధ్యవుంది. ఇది ప్రపంచ ప్రసిద్ధినొందిన ఆరోగ్యసదనం. ప్రపంచం అన్నిదిశలనుండి (ముఖ్యంగా ఆసియాదేశాలనుంచి) క్షయ రోగులు యిక్కడికివచ్చి చికిత్సపొందుతారు. ఈ ప్రదేశపు వింతయయిన శీతోష్ణస్థితే వ్యాధిని కుదురుస్తుందనీ, మందులు, ఆహారం వంటి యితర విషయాలు దీనితరువాత నే అని అంటారు.

2. హార్స్లే కొండలు: ఆరోగ్య కేంద్రం స్థాపనకు హార్స్లే కొండలు ఆదర్శమయిన ప్రదేశం. ఇవి ఎమ్. ఎస్. ఎల్. నుంచి సుమారు 4000 అ. యెత్తున వున్నాయి. ఇంచుమించు ఒక శతాబ్దం వెనుక కలక్టరుగావున్న మిస్టర్ డబ్ల్యు. డి. హార్స్లే మొట్టమొదటగా యీకొండను తననిమిత్తం వాడుకున్నాడు. గొప్ప దూరదృష్టితో ఆయన అక్కడ గృహాలను నిర్మించి, తోటను వేశాడు; పశువులను వన్యమృగాలనుంచి రక్షించుటకవసర మయిన చర్యలన్నీ తీసుకున్నాడు.

ఇటీవలివరకూ యీకొండను నడిచి యెక్కవలసి వచ్చేది లేదా గుర్రంమీద వెళ్లవలసివచ్చేది. 1952లో చిత్తూరు జిల్లాబోర్డు కరువునిధులతో 4మైళ్లపొడుగు రోడ్డును నిర్మించింది. ఇది కొండపాదాన్ని అగ్రంతో కలుపుతుంది. దీనికి మిక్కిలి దగ్గరలోనున్న రైలు స్టేషను తుమ్మనగుంట. ఇది కొండపాదానికి 5మైళ్ల దూరంలోవుంది. ఈ రెండింటికిమధ్య మోటార్లు నడిచే రోడ్డువుంది.

హార్స్లే కొండను ఆదర్శ ప్రాయమయిన వేసవి కేంద్రంగా అభివృద్ధి పరచుటకై విద్యుచ్ఛక్తి, నీటి సరఫరా మున్నగు వాటికై రూ. 10,00,000 అవసరమని అంచనా వేయబడిన. ఈపనిని యించుమించు ఒక సంవత్సరంలో పూర్తిచేయుటకై సత్వర చర్యలు గైకొనబడుతున్నాయి. ఈకొండలపై సహకార బిల్డింగు సొసైటికి 23-9-58న రాష్ట్ర గవర్నరు శ్రీ భీమసేన సచార్ శంకుస్థాపన చేశారు.

హార్స్లే కొండలు త్వరలోనే దేశంలో వుత్తమోత్తమ మయిన వేసవి కేంద్రంగా తయారు కాగలవని ఆశించబడున్నది.

3. పుత్తూరు, వాయల్పాడు తాలూకాలలో ప్రకృతి సౌందర్యానికి నిలయమయిన రెండు ప్రదేశాలలో జలపాతాలున్నాయి. ఈజలపాతాలవద్ద జలంలో ఖనిజపదార్థం పుష్కలంగా వుంటుందనీ, అందులో వ్యాధి నివారణ లక్షణాలున్నాయనీ

చెబుతారు. శివరాత్రినాడు ప్రజలీ కేంద్రాలకు యాత్రవెళ్లి ఆజలపాతాలలో స్నానమాచరిస్తారు.

4. చంద్రగిరి మహాలు: చంద్రగిరి మహాలు చంద్రగిరి పట్టణం పశ్చిమాన అరమైలు దూరంలో వుంది. ఈ కోట సముద్రమట్టానికి యించుమించు 600 మైళ్ళ యెత్తునగల కొండపై నిర్మించబడింది. ఈ కొండ దక్షిణభాగాన విశాలమయిన ప్రదేశం చుట్టూ బలమయిన గోడలు నిర్మించబడ్డాయి. ఇప్పుడవి శిథిలమయిపోయాయి. వాటిచుట్టూ కందకం వుంది. ఒకప్పుడది ప్రకృతి సిద్ధమయిన వూటతో నింపబడేది, కాని యిప్పుడు దాదాపు యెండిపోయి వుంది. ఈకోటను క్రీ. శ. 1000 లో నారాయణవనం కార్వేటినగర పాలకుడు ఇమ్మడి నరసింహయాదవ రాయడు నిర్మించాడని భావించబడుతున్నది. దిగువ కోటవద్ద శిథిలాలు రెండు రాజసౌధాలు లేక మహాలులు. వీటి క్రిందిభాగం రాతితోను పైభాగం యిటుకతోను నిర్మించబడింది. ప్రధాన భవనానికి రాజామహల్ అని పేరు. ఇది మిక్కిలి గంభీరంగా కనబడుతుంది. మహాలు పైభాగం గోపురాలవంటి హిందూ నిర్మాణాలతో అద్భుతంగా వుంది. సెంటు జార్జికోట స్థలాన్ని తూర్పు ఇండియా కంపెనీకి యిచ్చిన అసలు పత్రంపై యిక్కడే క్రీ. శ. 1639 లో సంతకం చేయబడింది. ఇప్పుడీ రాజసౌధం పురాతత్వ శాఖ అధ్వర్యంలో వుండి దానిచేతనే నిర్వహింపబడుతున్నది.

5. యాత్రాకేంద్రాలు: తిరుపతి, కాళహస్తి, తిరుత్తనులు యీ జిల్లాలో మిక్కిలి ముఖ్యమయిన యాత్రాకేంద్రాలు దేశంలో యీ పుణ్యక్షేత్రాలను గురించి యెరుగని హిందువులుండరు. శ్రీ కాళహస్తి యీ జిల్లా తాలూకా ముఖ్యపట్నాలలో ఒకటి. ఇది రేణిగుంట కూడలికి 14 మైళ్ల దూరంలో రేణిగుంట-గూడూరు బ్రాడ్ గేజ్ మార్గంలో వుంది; దానికి చక్కని రైలుస్టేషను వుంది.

ఇక్కడికి శివరాత్రిరోజున లక్షలాది యాత్రికులు వచ్చి శ్రీ కాళహస్తీశ్వరుని దర్శిస్తారు. తిరుపతి దర్శించిన యాత్రికులందరూ యింటికి వెళ్లబోయే ముందు కాళహస్తిని కూడా దర్శిస్తారు.

శ్రీ నాదముని రెడ్డి, శా. స. స. (తిరుపతి).

తిరుత్తనికూడా యీ తాలూకా ముఖ్యపట్నాలలో ఒకటి. ఇది చిత్తూరుకి 42 మైళ్ల దూరంలోను, రేణిగుంటకి 33 మై. దూరంలోను వుంది. మద్రాసు-రాయచూరు బ్రాడ్ గేజ్ మార్గం యీ పట్టణం మీదుగా పోతుంది. ఇక్కడ రైలుస్టేషనుకూడా వుంది. ఇక్కడ శ్రీ సుబ్రహ్మణ్యస్వామి ఆలయం మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. ఏటా శ్రావణ, కార్తీక కృత్తిక రోజులలో వేలాది భక్తులు ముఖ్యంగా దక్షిణభారతం నుంచి యిక్కడికి వచ్చి సుబ్రహ్మణ్యస్వామిని దర్శిస్తారు. ఆ కృత్తికరోజులలో యీ దేవాలయానికి భక్తులు వేలాదికావిళ్లను మోసుకువస్తారు. అదెంతో దర్శనీయమయిన దృశ్యం.

తిరుపతి చంద్రగిరి తాలూకాలోనున్న మునిసిపలు పట్టణం. కాట్పాడి-రేణిగుంట మీటర్ గేజ్ మార్గం యీపట్టణం మీదుగా పోతుంది. ఇది రేణిగుంట కూడలివి 6 మైళ్ల దూరంలో వుంది. తిరుమల

కొండలు తూర్పు కనుమలలో ఒక భాగం. తిరుపతి చారిత్రాత్మకంగా ప్రసిద్ధమయినది. రోజూ తిరుపతి శ్రీవేంకటేశ్వరుని దర్శించే యాత్రికుల సగటు సంఖ్య యించు మించు 5000 ఉంటుందని చెబుతారు. ఒక్క హుండీలోనే నెలకు 1-1/2, 2 లక్షలు దొరుకుతాయి

తిరుపతి-తిరుమల దేవస్థానాలను ధర్మకర్తల సంఘం నిర్వహిస్తున్నది. తి. తి. దే. అధికారులు యించుమించు ఒక దశాబ్దం వెనుక కొండక్రిందినుంచి పైకి 11 మైళ్ళ నిడివిగల బస్సుమార్గాన్ని రూ. 12 లక్షల ఖర్చుతో నిర్మించారు తి. తి దే. బస్సులు ప్రతినిత్యం యాత్రికులను దిగువ తిరుపతి (తిరుపతి) నుంచి యెగువ తిరుపతికి (తిరుమల)కి కొని పోతాయి. సంవత్సరానికోమారు స్వామికి బ్రహ్మోత్సవం జరుగుతుంది. అప్పుడు దేశం అన్ని ప్రాంతాలనుంచి అసంఖ్యాక ప్రజానీకం తిరుపతికి వచ్చి శ్రీ వెంకటేశ్వర స్వామిని దర్శిస్తారు.

తిరుపతిలో మరొక ముఖ్య దేవాలయం గోవిందరాజులస్వామి ఆలయం. కొండదిగి రాగానే భక్తులు యీ దేవాలయాన్నికూడా దర్శిస్తారు. తిరుపతికి తూర్పున రెండుమైళ్ళ దూరంలో తిరుచానూరులో వేంకటేశ్వరునిదేవి పద్మావతీదేవి (అలమేలు మంగమ్మ) ఆలయంవుంది. భక్తులు తప్పక యిక్కడికికూడా వచ్చి వూరిమధ్యగల పుణ్యసరస్సులో స్నానమాచరించి దేవిని అర్చిస్తారు.

## సమాజాభివృద్ధి

ప్రణాళికలు, అభివృద్ధి ప్రయోజనాలకై యీ జిల్లా 27 బ్లాకులుగా యేర్పాటు చేయబడింది. ప్రస్తుతం 8 మొదటిఘట్టం బ్లాకులు, 4 రెండవఘట్టం బ్లాకులు, ఒక సమాజాభివృద్ధి కేంద్రి, పూర్వ విస్తరణకేంద్రం వున్నాయి. ఇంతవరకూ 9,99,527 జనాభాగల 3,082 చ. మైళ్ల ప్రదేశం సమాజాభివృద్ధి కార్యక్రమం క్రిందికితేబడింది. ఇప్పటికి ఈకార్యక్రమం క్రిందకు తేబడిన గ్రామాలసంఖ్య 1492 దీనిపట్ల ప్రజలెంతో వుత్సాహాన్ని ఆసక్తిని చూపుతున్నారు. గ్రామాల అభివృద్ధికై చేపట్టబడే ప్రతి అభివృద్ధి కార్యక్రమంలోను వారు చురుగ్గా పాల్గొనుటవల్ల యిది విదితమవుతున్నది.

ఈజిల్లాలో యీ కార్యక్రమం ఆరంభమాది 30.9.58 వరకూ దానిక్రింద రూ. 73,25,684 ఖర్చు పెట్ట బడ్డాయి. అందులో ప్రజల విరాళం రూ 21,73,167. గ్రామరస్తాల అభివృద్ధి సహకార పధకంక్రింద 74 రోడ్డుపనులు మంజూరయినవి; 32 పనులు పూర్తిఅయినవి; 30పనులు జరుగుతున్నాయి. ప్రారంభంకాని 12 పనులు స్థానేప్రత్యామ్నాయ పనులు ప్రతిపాదించబడినవి. 31.3 58 వరకూ యీ పధకం క్రిందిఖర్చు రూ 2,28,776. 1958-59 కి కేంద్ర,రాష్ట్రగ్రాంటులక్రింద మొత్తంరూ 1,47,661 లు మంజూరయినవి. ఇందులో రెండు గ్రాంటులక్రింద రూ 7168 ఖర్చు పెట్టబడినవి. 1958 సెప్టెంబరు నెలాఖరువరకూ ప్రజల విరాళంక్రింద రూ. 3,573 వచ్చాయి.

ఈ పధకంక్రింద 1957-58 కి 56 పనులు మంజూరు చేయబడ్డాయి. క్రిందటియేడాది 16 పనులు చేపట్టబడి జరుగుతున్నాయి. 31-3-58 వరకూ కేంద్ర, రాష్ట్రగ్రాంటులు రెంటికి క్రింద రూ. 8,134 ఖర్చు పెట్టబడ్డాయి. ఇందులో ప్రజల విరాళం రూ. 4,067 చేరివున్నాయి. 1958—59 కి రూ. 59,500 మంజూరు చేయబడ్డాయి. ఈపధకాన్ని నిర్వహిస్తున్న సహాయ ఇంజనీరు (ప్లానింగు) యీ పనులు జరుగుట కవసరమయినచర్య తీసుకుంటున్నాడు.

స్థానికాభివృద్ధి పనులపధకం రాష్ట్రంలోని యితర జిల్లాలన్నిటిలోకంటె యీజిల్లాలో బాగా జరుగుతున్నట్లు చెప్పబడుతున్నది. ఇంతవరకూ యీపధకం క్రింద ఖర్చయిన మొత్తంసొమ్ము, చేపట్టబడిన పనుల వల్ల యిది విదితమవుతుంది. 1953-54 లో చేపట్టబడిన 1467 పనులలోను 1958 సెప్టెంబరు నాటికి 1157 పనులు పూర్తిఅయాయి. 31-3-58 వరకూ అయిన ఖర్చువివరాలు యివి :-

| | రూ. |
|---|---|
| కేంద్రగ్రాంటు | 21,55,437 |
| రాష్ట్రగ్రాంటు | 5,26,727 |
| పబ్లిక్, స్థానికసంస్థల విరాళం | 16,28,710 |
| మొత్తం | 43,10,874 |

1958-59 కి కేంద్ర రాష్ట్రగ్రాంటుల క్రింద రూ. 3,41,521 మంజూరు చేయబడ్డాయి. ఇందులో 1958 సెప్టెంబరు ఆఖరినాటికి రూ. 1,99,842 ఖర్చు పెట్టబడ్డాయి. 1958 సెప్టెంబరు నెలాఖరికి 1467 పనులలోను 1279 పనులు పూర్తి అయాయి. మిగిలిన పనులనుకూడా సాధ్యమయినంత త్వరలో పూర్తిచేయుటకై ప్రత్యేకచర్య గైకొనబడుతున్నది.

## పంచాయతీ సమితి

ప్రజాస్వామ్య వికేంద్రీకరణ సూత్రంక్రింద 1-7-58 నుంచి కలికిరి పంచాయతీసమితి యేర్పాటు చేయబడింది. ఇందులో ఎన్నికయిన సభ్యులు 30 మంది, కో-ఆప్టు చేయబడినసభ్యులు 5 గురు వున్నారు.

## కుటుంబానికొక ప్రణాళిక

ప్రతికుటుంబము ఆర్థిక, సాంఘిక అభ్యున్నతికై ఒక ప్రణాళికను వేసుకొనుటకు వీలుగా నగరి సమాజాభివృద్ధికేంద్రం వేపగుంటగ్రామంలో "కుటుంబానికొక ప్రణాళిక" ప్రవేశపెట్టబడింది. ప్రత్యేక శిక్షణ పొందిన గ్రామస్థాయి కార్యకర్తఒకడు ప్రత్యేకం యీపనిని చూస్తున్నాడు. ఒక్కొక్క కుటుంబం ప్రమాణం, అవసరాలకు సంబంధించిన పరిశీలన పూర్తిఅయింది; అది ప్రభుత్వానికి సమర్పించబడింది. ఈప్రణాళిక అమలుకై చర్య గైకొనబడుతున్నది.



# నిజామాబాదులో సమాజాభివృద్ధి

నిజామాబాదు జిల్లాలో ఆరు తాలూకాలున్నాయి. వాటిపేర్లు యివి: నిజామాబాదు, ఆర్మూరు. బోధన్, బన్సవాడ, ఎల్లారెడ్డి, కామారెడ్డి. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ ఫలితంగా నాందేడు జిల్లాలోని డెగ్లూరుతహసీల్‌లోని రెండుసర్కిళ్లు—బిచ్‌కొండ, జుక్కల్—బన్సవాడ తహసీల్‌లో చేర్చబడ్డాయి.

ఈ జిల్లాదిగువ 12 అభివృద్ధి కేంద్రాలుగా విభజించబడింది :-

| | | | |
|---|---|---|---|
| 1. నిజామాబాదు తా॥ | 1. | నిజామాబాదు అభివృద్ధి కేంద్రం | |
| | 2. | నావిపేట | ,, |
| 2. బన్సవాడ తా॥ | 3. | బన్సవాడ | ,, |
| | 4. | మద్నూరు | ,, |
| 3. బోధన్ తా॥ | 5. | బోధన్ | ,, |
| | 6. | ఏద్‌పల్లి | ,, |
| 4. ఆర్మూరు తా॥ | 7. | ఆర్మూరు | ,, |
| | 8. | మోర్తాడ్ | ,, |
| | 9. | భీమగల్ | ,, |
| 5. కామారెడ్డి తా॥ | 10. | కామారెడ్డి | ,, |
| | 11. | దోమకొండ | ,, |
| 6. ఎల్లారెడ్డి తా॥ | 12. | ఎల్లారెడ్డి | ,, |

తొలియేడు కేంద్రాలలోను యిప్పుడు సమాజాభివృద్ధి కార్యక్రమం అమలు జరుగుతున్నది.

## నిజాంసాగర్ కమ్యూనిటీప్రాజెక్టు

నిజాంసాగర్ కమ్యూనిటీప్రాజెక్టుబ్లాకు ప్రారంభంతో 2-10-52 న నిజామాబాదు జిల్లాలో సమాజాభివృద్ధి కార్యక్రమం అరంభించబడింది. మొదట దానిక్రింద, బోధన్, బన్సవాడ తాలూకాలలోని 156 గ్రామాలుమాత్రమే చేరివున్నాయి. కాని ఒకసంవత్సరం పిమ్మట యీప్రాజెక్టు బన్సవాడ, బోధన్, నిజామాబాదుతాలూకాలు మూడింటికి పూర్తిగా వర్తింప చేయబడింది; ఆవిధంగా దానిక్రింద 3,77,259 జనాభాగల 369 గ్రామాలు చేరాయి.

ఈ ప్రాజెక్టు తీవ్రఅభివృద్ధికి నిర్ణయించబడిన సుమారు 3 సంవత్సరాలకాలం పూర్తయిన పిమ్మట నార్మలైజు చేయబడింది. పూర్వపు కమ్యూనిటీ ప్రాజెక్టు కేంద్రాలు 3 1-1-57 నుంచి అయిదు అనంతర తీవ్రఅభివృద్ధి కేంద్రాలుగా చేయబడినవి. వాటి ముఖ్యకార్యాలయాలు బన్సవాడ, బోధన్, ఏద్‌పల్లి, నావిపేట, నిజామాబాదులలో యేర్పరచబడ్డాయి. ఆర్మూరులో ముఖ్య కార్యాలయంగల ఆర్మూరు అభివృద్ధికేంద్రం 20-12-57 న ఆరంభించబడింది; దానిలో ఆర్మూరు, మగ్గి, ఖుదావందపురం రెవిన్యూసర్కిళ్లు చేరివున్నాయి. మద్నూరు కేంద్రం 16-10-58 న ఆరంభించబడింది.

ఈజిల్లాలోని 5 అనంతర తీవ్రఅభివృద్ధి కేంద్రాలు యిప్పుడు రెండవఅంచె కేంద్రాలుగా మార్చబడ్డాయి; జా. వి. సే. కేంద్రాలు రెండూ యిప్పుడు మొదటిఅంచె కేంద్రాలని వ్యవహరింపబడుతున్నాయి. కొత్త కార్యక్రమం ప్రకారం మొదటిఅంచె కేంద్రం ఒక్కొక్కటి సంవత్సరానికి లక్ష రూపాయలను పొందవచ్చు; ఆర్మూరు, మద్నూరు మొదటిఅంచె కేంద్రాల సందర్భంలో ఖర్చుకి పథకం నిర్మించిన 5 సంవత్సరాలకి రూ 12 లక్షలు గరిష్ఠంగా నిర్ణయించబడింది.

## సిబ్బంది

ప్రతి అభివృద్ధికేంద్రంలోను యిప్పుడు ఆరుగురు విస్తరణాధికార్లు వున్నారు. వివరాలుయివి: విస్తరణాధికారి, వ్యవసాయం, 2. పశుపోషణ, 3. సహకారం, 4. పరిశ్రమలు, 5. పంచాయతీలు, 6. సూపర్‌వైజరు; ఇద్దరు సాంఘిక విద్యా ఆర్గనైజర్లు; గ్రా. అ. అ. నాయకుడుగా 10 మంది గ్రామస్థాయి కార్యకర్తలు. జిల్లాస్థాయిలో జిల్లాప్రణాళికలు, అభివృద్ధికృషిలో కలక్టరికి గెజిటెడ్ కార్యనిర్వాహక సహాయకుడు (జిల్లాప్రణాళికల అధికారి) తోడ్పడతాడు. కలక్టరు కార్యాలయంలో ప్రణాళికలవిభాగం ఒకటి వుంది. అందులో ఒక హుజూరు హెడ్‌గుమాస్తా, ముగ్గురు అప్పర్ డివిజన్ గుమాస్తాలు, ఒక లోయర్ డివిజన్‌గుమాస్తా; ఒకటైపిస్టు వుంటారు. ఇటీవల బి. డి. సి. వుద్యోగం అదనంగా మంజూరు చేయబడింది. ఈసిబ్బంది డి. పి. ఐ. ఓ. అధ్వర్యాన పనిచేస్తుంది.

## బడ్జెట్టు

1-4-57 నాటికిగల పూర్వపు నిజాంసాగర్ కమ్యూనిటీప్రాజెక్టు బడ్జెట్టులలో రూ 10,10,885 అప్పుక్రింద, రూ 4,47,266 అప్పుకాని దానిక్రింద, ఖర్చుకాకుండా వుండిపోయాయి. ఈమొత్తాలను 1958 మార్చి నెలాఖరివరకూ అనంతర తీవ్రఅభివృద్ధి కేంద్రాలు అయిదింటిలోను ఖర్చుచేయాలని వుత్తరువు చేయబడింది. ఈమొత్తాలు యీ అ. తీ. అ. కేంద్రాలు అయిదింటికి దిగువవిధంగా కేటాయించబడ్డాయి: అప్పుక్రింద రూ. 69,906 అవి అవసరం లేనందున స్వాధీనం చేయబడినవి; మిగిలిన పనులన్నీ పూర్తి చేయబడినవి.

| కేటాయింపు | అప్పు | అప్పు కానిది | మొత్తం |
|---|---|---|---|
| నిజామాబాదు కేంద్రం | 1,10,627 | 1,04,410 | 2,15,037 |
| నావిపేట కేంద్రం | 55,168 | 55,271 | 1,10,439 |
| బోధన్ కేంద్రం | 42.641 | 1,34,113 | 1,76,754 |
| బన్సవాడ కేంద్రం | 21,034 | 93,946 | 1,14,980 |
| ఏడ్‌పల్లి కేంద్రం | 13,243 | 59,500 | 72,740 |
| ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు ఐ. బి. | 2,31,000 | — | 2,31,000 |

### 1957—58 వ్యయం

| | | | |
|---|---|---|---|
| నిజామాబాదు కేంద్రం | 1,04,890 | 1,24,120 | 2,29,010 |
| బోధన్ కేంద్రం | 25,627 | 1,31,109 | 1,56,716 |
| బన్సవాడ కేంద్రం | 7,470 | 69,723 | 77,193 |
| నావిపేట కేంద్రం | 33,097 | 64,750 | 97,847 |
| ఏడ్‌పల్లి కేంద్రం | 6,005 | 52,497 | 58,502 |
| ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, ఐ. బి. | 1,99,471 | — | 1,99,471 |

(విద్యాశాఖకు బదిలీచేయనగు వుపాధ్యాయుల జీతాలు కలుపుకుని).

## లక్ష్యాలు, సాధించినపని

వివిధ కార్యకలాపాలక్రింద అభివృద్ధి కేంద్రాలలో సాధించబడిన పని ప్రతినెలా జిల్లా కలక్టరిచే సమీక్షించ బడుతున్నది. పెక్కు సందర్భాలలో 1957-58 కి నిర్ణయించబడిన లక్ష్యాలు సిద్ధించినవి. 1958-59 కి కూడా లక్ష్యాలు నిర్ణయించబడినవి. ఎక్కువపని జరిగే కాలంలో, జరుగని కాలాలను దృష్టిలో వుంచుకొని సాలుసరి లక్ష్యాలను నెలవారీ లక్ష్యాలుగా విభజించుట జరిగింది.

## వ్యవసాయం

వరి, చెఱకు మిక్కిలి ముఖ్యమయిన పంటలు. వ్యవసాయ కార్యక్రమంలో ముఖ్యాంశం ఉత్తమ విత్తనాలు, రసాయన యెరువుల పంపిణీ. 1957-58 లో 22445 మ. విత్తనాలు, 2,41,148 మ.రసాయన యెరువులు పంపిణీ చేయబడ్డాయి.

పై కాలంలో అభివృద్ధి కేంద్రాల ప్రాంతంలో 48,770 యెకరాలు జపాను పద్ధతి వరిసాగు క్రిందకు తేబడినవి.

## పశు పోషణ

కమ్యూనిటీ ప్రాజెక్టుకాలంలో బన్సవాడలో ఒక కృత్రిమ పిండోత్పత్తి కేంద్రము ఒక కోళ్లపరిశ్రిమ యూనిట్టు నెలకొల్ప బడ్డాయి. ఇప్పుడా సంస్థను పశుపోషణ శాఖ నడుపుతున్నది. సి. పి. నిధుల నుంచి 12,000 వ్యయంతో దాచేపల్లిలో ఒక పశు వైద్యశాల నిర్మించబడింది. 1957-58 లో అభివృద్ధి కేంద్రం గ్రామాలకి 22 ఆబోతులను సరఫరా చేయ బడ్డాయి.

## సహకారం

1957-58 లో 54 సహకార సంఘాలు ప్రారంభింప బడినవి; పనిచేయకుండా వున్న 19 సంఘాలు పునః ప్రారంభించ బడినవి.

## విద్య

1957-58 లో అభివృద్ధి కేంద్రాల ప్రాంతంలో 24 కొత్త పాఠశాలలు ప్రారంభించ బడినవి.

## ఆరోగ్య పారిశుద్ధ్యాలు

1957-58 లో అభివృద్ధి కేంద్రాల గ్రామాలలో 153 మంచినీటి బావులు త్రవ్వబడ్డాయి. 156 మరమ్మతు చేయబడ్డాయి,

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

క. ప్రా. కాలంలో బన్సవాడ, బోధన్, నావిపేటలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ప్రారంభింప బడినవి. ప్రాజెక్టు నార్మలైజ్ చేయబడిన కారణంగా యివి వైద్యశాఖచే స్వాధీనం చేసుకొనబడినవి. ఈ ప్రధాన కేంద్రాలలో ప్రతి ఒక్కదానికి అనుబంధితమయి నాలుగేసి వుప కేంద్రాలున్నాయి. వైద్య ప్రణాళిక క్రింద యిప్పుడు నిజామాబాదు, ఏడ్‌పల్లి రెండవ అంచె కేంద్రాలకు 'రెండు ప్రా. ఆ. కేంద్రాలు మంజూరు చేయబడినవి; అవి ధర్పల్లి, రంజాల్ గ్రామాలలో యేర్పాటు చేయబడతాయి. అక్కడి ప్రజలు 10,000 రొఖ్ఖంగా యిచ్చి, ప్రతి సందర్భంలో 2 యెకరాల భూమిని విరాళమిచ్చారు. సమాజాభివృద్ధి కారక్రమంక్రింద ఆర్మూరు కేంద్రంలోని దేవగాంలోను, మద్నూరులోను కూడా ప్రా. ఆ. కేంద్రాలు నెలకొల్ప బడతాయి. దేవగాంలో పని ప్రారంభానికి అవసరమయిన ప్రాథమిక చర్యలు పూర్తి అయినవి.

## గ్రామీణకళలు, వృత్తులు, పరిశ్రమలు

క. ప్రా. కాలంలో బన్సవాడ, బోధన్, నావిపేటలలో ప్రారంభింపబడిన 3 వుత్పత్తి- ప్రదర్శన-శిక్షణా కేంద్రాలు పని చేస్తున్నాయి. నావిపేటలో ఆర్. ఎ సి.ఐ. కేంద్రం నెలకొల్పుటకొక భవంతి, షో రూమూ రూ. 20,000 తో నిర్మించబడ్డాయి. అర్హులయిన చేతి పనివారికి అప్పులు యివ్వబడ్డాయి.

## గ్రామీణ గృహవసతి

పూర్వపు నిజాంసాగర్ కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతంలో క. ప్రా. కాలంలో చెరువుల బాగు, పంపిణీ కాలువల రిమోడలింగు చేరివున్నాయి. 1957 మార్చి నెలాఖరువరకూ పూర్వపు నిజాంసాగర్ కమ్యూనిటీ ప్రాజెక్టు 1,11 బ్లాకులలో, పథకం

కేటాయింపు రూ. 9,80,000 కాగా రూ.6,67,586, అలాగే 111 బ్లాకులో కేటాయింపు రూ. 4,90,000 కాగా రూ. 7,72,721 ఖర్చు చేయబడినవి. 1957-58 లో బ్లాకు బడ్జెట్టులక్రింద యీ బ్లాకులలో రూ. 2,75,682 ఖర్చు నిర్ణయించబడింది; కాగా యిందునిమిత్తం రూ. 3,11,948 విడుదలచేయ బడినవి.

మొదటిఅంచె బ్లాకులలో ఒక్కొక్క దానికి 5 సవంత్సరాలలో దిగువ ప్రయోజనాలకై అప్పులు యిచ్చుటకై 3,40,000 కేటాయించబడినవి: కృష్ణిఇరి గేషను, నీటిపారుదల బావులు, ఫిల్టర్ పాయింటు బావులు, బోర్ బావులు, ఆయిల్ యింజన్లు, పంపు సెట్లు కొనుగోలు, ప్రైవేటు పంటచెరువుల మరమ్మతు, భూసార పరిరక్షణ, నీటిపారుదల ప్రయోజనాలకై యెడ్ల కొనుగోలు, నీటిపారుదల కార్యక్రమంక్రింద చేపట్టబడిన ప్రైవేటు నీటిపారుదల పనులకు యిచ్చిన అప్పులకు 25 శాతం సబ్సిడీకి అర్హతవుంది. ఇందుకై సీటిపారుదలక్రింద ii అంచె బ్లాకులలో ఒక్కొక్క దానికి అప్పుబాపతు రూ. 17,000 కేటాయించ బడినవి.

1958-59లో ఖర్చుకై ఆర్భూరు, మొదటి అంచె బ్లాకుకి రూ. 20,000, ii అంచె బ్లాకులు అయిదిటి లో ఒక్కొక్కదానికి రూ. 16,000 విడుదలచేయ బడినవి.

## భవనాలు

బన్సవాడ, బోధన్, నావిపేటలలో సిబ్బందిగృహాలు, నిజామాబాదులో కార్యాలయ భవనము నిర్మించ బడ్డాయి.

తీవ్ర కృషి కాలంలో వివిధ బ్లాకుల సమాజాభి వృద్ధి కార్యక్రమం క్రింద చేపట్టి పూర్తిచేసిన భవ నాల కార్యక్రమం వివరాలు దిగువ పట్టీలో యివ్వ బడినవి.

| బ్లాకు | పాఠశాలా భవనాలు | ప్రసూతి కేంద్రాలు | గిడ్డంగులు | సామాజిక కేంద్రాలు | గ్రా-స్థా-కాలు. మంత్రసానుల గృహాలు | ఆస్పత్రిలు |
|---|---|---|---|---|---|---|
| బన్సవాడ | 21 | 2 | 4 | 2 | 21 | — |
| బోధన్ | 12 | 2 | 2 | 2 | 2 | 1 |
| ఏద్పల్లి | 9 | 2 | 2 | 1 | 11 | — |
| నిజామాబాదు | 8 | 2 | — | 1 | 12 | — |
| నావిపేట | 14 | 2 | — | 1 | 13 | 1 |

మిగిలిన పనుల్ని పూర్తిచేయుటకై మిగిలిన సొమ్మును ఖర్చుచేయుటకు 1958 మార్చి నెలాఖరు వరకూ మాత్రమే వీలు వున్నందున వాటిని పూర్తి చేయుటలోనే శ్రద్ధ గైకొనబడింది.

## రోడ్లు

పూర్వపు నిజాంసాగర్ కమ్యూనిటీ ప్రాజెక్టు 8 క. ప్రా. బ్లాకులలోను క. ప్రా. కాలంలో యించుమించు 32 మైళ్ల నిడివిగల పక్కారోడ్లు నిర్మించబడ్డాయి.

దిగువరోడ్లుకి కేటాయించిన సొమ్ము 1958 మార్చి నెలాఖరుతో మురిగి పోయినందున వాటి నిర్మాణం పూర్తి కాలేదు.

కల్లూరు— పెంటఖుర్దురోడ్డు 4-4 1/2

ఇందల్వాయ్- ధర్పల్లిరోడ్డు

గన్నారం- సిర్నాపల్లి

ఈ పనులను డిపార్టుమెంటల్ కార్యక్రమంక్రింద పూర్తిచేయుటకు కృషి సలుపబడుతున్నది.

## కమిటీలు

జిల్లా ప్రణాళికలు, అభివృద్ధి సంఘం పునర్నిర్మించ బడింది. ఈ కొత్తసంఘంలో 31మంది అధికారసభ్యులు, 39 మంది అనధికార సభ్యులు వున్నారు. అది ప్రతి రెండు నెలలకు ఒకసారి క్రమానుసారం సమావేశ మవుతున్నది. 1957 ఆగష్టులో పునర్నిర్మించబడిన పిమ్మట అది 8 సార్లు సమావేశ మయింది.

బ్లాకు ప్రణాళికలు, అభివృద్ధి సంఘాలుకూడా పునర్నిర్మించ బడినవి. ii అంచెబ్లాకులలో ప్రయోగాత్మక చర్యగా అనధికారులు సంఘాల అధ్యక్షులుగా యేర్పరచ బడుతున్నారు. బ్లాకు ప్రాంతంలో అత్యవసరమయిన అభివృద్ధి పనులవిషయంలో నిర్ణయాలు తీసుకొనుటకు యీ సంఘాలు బ్లాకుకార్యక్రమాలను ఆమోదిస్తాయి.

## పంచాయతీ సమితి

బన్సవాడలో ఆడ్‌హాక్ పంచాయతీసమితి యేర్పరచబడింది. ప్రస్తుతం ఆ బ్లాకులో 9 పంచాయతీలు పనిచేస్తున్నాయి. మరి 33 పంచాయతీల యేర్పాటుకి ప్రతిపాదనలు మంజూరుకై పంపబడినవి. సంకల్పించిన పంచాయతీ గ్రామాలకు చెందిన 33 మందిని సమితి సభ్యులుగా పనిచేయుటకై కలక్టరు నియమించారు. ఆ తరువాత వీరి స్థానములో ఎన్నికయిన పంచాయతీ అధ్యక్షులు చేరుతారు. బన్సవాడ ఆడ్‌హాక్ పంచాయతీ సమితిలో 10 పంచాయతీల అధ్యక్షులు, 33 మంది నియమితులు, కోఆప్టు చేయబడినవారు 5 మంది వున్నారు. సమితి అధ్యక్షుడుగా శ్రీ నార్ల లింగయ్య యెన్నుకో బడ్డాడు. ఈ సమితి ఆ బ్లాకు బ్లా. ప్ర. అ. సంఘం స్థానే పని చేస్తున్నది.

సమితి బ్లాకుకి సంబంధించినంతవరకు డిపార్టుమెంటులీ అధికారాలు, పనులు, నిధులను సమితికి బదిలీ చేయమని వుత్తరువులు కూడా అందాయి. వ్యవసాయ, విద్య, సాంఘిక సేవా శాఖలు వాటి వాటి బడ్జెట్టులలో సమితిబ్లాకుకి కేటాయించిన నిధులను సమితికి యిదివరకే బదిలీ చేశాయి.

ప్రజాస్వామ్య వికేంద్రీకరణకు సంబంధించిన పరిపాలనా వ్యవహారాలలో సమితి సభ్యులు కొందరు రాజేంద్రనగర్ విస్తరణ శిక్షణాకేంద్రంలో శిక్షణ పొందారు.

## కుటుంబానికొక ప్రణాళిక పథకం

"కుటుంబానికొక ప్రణాళిక" పథకాల అమలుకై బన్సవాడ బ్లాకులోని గాలిపురం గ్రామం యెన్నబడింది. అక్కడి 148 కుటుంబాలకి సంబంధించిన ప్రణాళికలు సిద్ధమయినవి; వాటి అమలుకై చర్య తీసుకొనబడింది.

ఈ గ్రామంలోని ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల వృత్తి విద్యా ప్రాథమిక పాఠశాలగా మార్చబడింది. ఆపాఠశాలలో కొత్తగా 30 మంది చేర్చుకోబడ్డారు. ఒక వయోజన విద్యాకేంద్రం ప్రారంభించబడింది. అందులో 36 మంది శిక్షణ పొందుతున్నారు. ఒక మహిళామండలి యేర్పరచబడింది; యువజన క్లబ్బు యేర్పాటుకై చర్య గైకొనబడింది.

ఈ గ్రామంలో పెద్దరకం సహకారసంఘం ఒకటి యేర్పాటు చేయబడుతున్నది. వ్యవసాయ పరపతి సంఘంలో అదనపుసభ్యులు చేర్చుకోబడుతున్నారు. పారిశ్రామిక సహకారసంఘం యేర్పాటుకై చర్య గైకొనబడింది.

ఈసంవత్సరం ఆబీ ఋతువులో యీ గ్రామంలోని వరిపొలాలన్నీ జపాను పద్ధతిక్రింద సాగు చేయబడ్డాయి.

ఇక్కడ అంబర్ చర్ఖా పరిశ్రమాలయం ఒకటి తెరువబడింది. పదిమందిస్త్రీలు శిక్షణ పొందుతున్నారు. ప్రజలు గ్రామం ముఖ్యరస్తాను బాగుచేసి పక్కల మురుగు కాలువలు త్రవ్వారు. ఈ కాలవలకి ఒక్క సిమెంటునుమాత్రం ప్రభుత్వం యిస్తుంది; మిగిలినపనిని ప్రజలు చేయాలని చెప్పబడింది. కేంద్రగ్రామీణ గృహావసతి పథకాల అమలుకి కూడా గాలిపురంగ్రామం యెన్నబడింది. పూరిగుడిసెలలో నివసించే కుటుంబాలు అప్పులు లభించగానే యిల్లు కట్టుకోడం ఆరంభిస్తాయి. ఈ గ్రామాన్ని యీబ్లాకులో ఆదర్శ గ్రామంగా

తయారు చేయుటకై ఆయాశాఖల పథకాలలో కొన్నిటిని యిక్కడ చేపట్టుమని అధికార్లకు చెప్ప బడింది.

## రాబీ వుద్యమం

రాబీనాట్లకాలంలో తీవ్రఆహారోత్పత్తి వుద్యమం ఆరంభించబడింది. ఈజిల్లాలో ఈవుద్యమం వరి, మొక్కజొన్న, పప్పులు, గోధుమపంటలకు పరిమితం చేయబడింది. ఈ వుద్యమానికై నిజామాబాదు బ్లాకులో 66 గ్రామాలు, నావిపేటబ్లాకులో 60, ఏడ్‌పల్లిబ్లాకులో 43, బోధన్ బ్లాకులో 58, బన్స వాడబ్లాకులో 50, మద్నూరుబ్లాకులో 50, ఆర్మూరు బ్లాకులో 50, ఆర్మూరుబ్లాకుకాని ప్రాంతంలో 50, కామారెడ్డి యెల్లారెడ్డి తాలూకాలలోచేరి 30 యెన్నబడ్డాయి. ఉద్యమబృందాలు నిజామాబాదు బ్లాకులో 13, నావిపేటబ్లాకులో 28, ఏడ్‌పల్లి బ్లాకులో 19, బోధన్ బ్లాకులో 29, బన్సవాడ బ్లాకులో 22, మద్నూరు, ఆర్మూరుబ్లాకులో చేరి 20, ఆర్మూరుబ్లాకుకాని ప్రాంతంలో 18, కామా రెడ్డి తాలూకాలో 13 యేర్పరచబడ్డాయి.

బ్లాకుసిబ్బంది అక్టోబర్ నెలలో 25 రోజులు పర్య టించి రాత్రులు గ్రామాలలోవుండి రైతులతో మాట్లాడారు. మాట్లాడిన రైతులపేరు, ప్రతిరైతుకి చేసిన సహాయం స్వభావం; అధికంగాపండిన ఆహారం వివరాలను వ్రాసివుంచమని గ్రామస్థాయి కార్యకర్త లకు ఆదేశించబడింది.

## యువజన సంస్థలు

బ్లా. అ. అధికార్లు బ్లాకులలో సీనియరు యూత్ క్లబ్బులు, నవజీవన్ కిసాన్‌క్లబ్బులు, యేర్పాటు చేశారు. ఈ యువజనక్లబ్బులకు గ్రంథాలయాల నిర్మాణం, శ్రమదానోద్యమాల యేర్పాటువంటి చిన్నచిన్న అభివృద్ధిపనులు అప్పగించబడతాయి.

## గ్రామనాయకుల శిక్షణా శిబిరాలు

ప్రతిబ్లాకులోను గ్రామనాయకుల శిక్షణా శిబి రాలు యేర్పాటు చేయబడ్డాయి.

## గ్రామరస్తాల అభివృద్ధి పథకం

ఇది కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు తలపెట్టిన కొత్త పథకం. ఖర్చులోసగం కేంద్రప్రభుత్వము, మిగిలిన సగములో రాష్ట్రప్రభుత్వము, ప్రజలు చెరిసగము భరిస్తారు. ఈపథకంక్రింద యీజిల్లాకు రూ 13,000 కేటాయించబడ్డాయి; రూ. 26,000 ఖర్చుపై చింత కుంటనుంచి మోస్రాకు 12 మైళ్ళపొడుగు రోడ్డు నిర్మించాలని సంకల్పించబడింది.

## ప్రజాసహకారం

బావులత్రవ్వకం, పాఠశాలా భవనాలు, ప్రసూతి కేంద్రాలు, రోడ్లు, గిడ్డంగులు, సామాజిక కేంద్రాల నిర్మాణంలో గ్రామీణులు అమితోత్సాహం ప్రద ర్శించారు. క. ప్రా. కార్యక్రమంక్రింద పాఠశాలా భవనాలు, రోడ్లనిర్మాణానికై ప్రజలు భూములను వుచితంగా యిచ్చారు. నిజాంసాగర్ కమ్యూనిటీ ప్రాజెక్టు I, II, III అంచెల బ్లాకులలో రొఖ్కం విరాళాలు లక్ష రూపాయలను మించాయి.



# ప్రజా సహకారం

పశ్చిమ గోదావరి జిల్లా భీమడోలు అభివృద్ధి కేంద్రంలోని జగన్నాథపురంలో ప్రజలు ఒక జలాశయాన్ని పైపులైన్లను నిర్మించారు; ఆ గ్రామస్థుల చిరకాలావసరముయిన దీని నిర్మాణం సమాజాభివృద్ధి కార్యక్రమంలో ప్రజలు అమితోత్సాహంతో యిచ్చే సహకారానికి చక్కని నిదర్శనం 21-1-59 న జిల్లా కలక్టరు వాడకానికి ప్రారంభోత్సవం చేశారు.

ఈ నిర్మాణం జగన్నాథపురం పంచాయతీ అధ్యక్షుడు, గ్రామస్థులు తలపెట్టారు. వారు 240 అ. యెత్తున జలాశయాన్ని, 2000 గేలన్ల నీరుపట్టే యెత్తు చెరువును నిర్మించారు; గ్రామంలోని 17 యిళ్లకు కలుపుటకై 1100 అ. పైపుమార్గాన్ని నిర్మించారు. ఇందుకు యించుమించు రూ. 20,000 ఖర్చు అయినవి. ఇందులో భీమడోలు స. అ. కేంద్రం రూ. 2,300 మాత్రం మంజూరు చేసింది. మిగిలిన ఖర్చును గ్రామ పంచాయతీ, గ్రామస్థులు పెట్టుకున్నారు.



జగన్నాథపురంలో నిర్మించబడిన నీటి చెరువు.

# అభిప్రాయ వేదిక

## ఔదార్యం

"ఉదారగుణం" అన్న శీర్షిక క్రిందవ్రాస్తూ టైమ్స్ ఆఫ్ ఇండియా' (27-2-59) పత్రిక యిలా వ్యాఖ్యానించింది:

"రాష్ట్రంలో ప్రాంతీయ భాషయయిన తెలుగులో జ్ఞానం సంపాదించని వుపాధ్యాయులపట్ల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రశంసనీయమయిన ఔదార్యం చూపించినది. హైదరాబాదులో పోలీసు చర్య అనంతరం ప్రాంతీయ భాషకు ప్రాధాన్యం కలిగిన నాటినుంచి రాష్ట్రంలో వుపాధ్యాయులకు ఆ భాషతో పరిచయముండుట అవసరమని భావించబడుతున్నది. ఆంధ్రేతర వుపాధ్యాయులు వుత్తీర్ణులు అవుతున్నారని తలచబడుతున్న తెలుగుపరీక్ష ప్రాథమిక మయినది; కాని ఆశ్చర్యమేమంటే, ఎన్నిసార్లు ప్రయత్నించినా చాలమంది వుపాధ్యాయులు అందులో వుత్తీర్ణులు కాలేకపోతున్నారు. ఉపాధ్యాయులు మామూలుగా సంఘంలో మానసికంగా వెనుకబడిన వర్గంవారని భావించబడరు కనుక, సఫలతపొందని శ్రద్ధగా ప్రయత్నించలేదని అనుకోవాలి.

ఈ తెలుగు పరీక్షలలో ఆఖరిది క్రిందటియేడాది ఆగస్టునెలలో జరిగింది. ఆతరువాత వరుసగా విఫలులయే వుపాధ్యాయులు వందమంది తొలగింపబడ్డారు. ఇప్పుడు, బహుశా అనేకవిజ్ఞప్తులు పంపుకొన్నమీదట, గరిష్ఠం 5 సంవత్సరాలలో ఆపరీక్షలో వుత్తీర్ణులు కావాలన్న షరతుపై తొలగింపబడిన వుపాధ్యాయులందరూ తిరిగి వుద్యోగంలో చేర్చుకోబడ్డారు. 1964 నాటికి అంతా వుత్తీర్ణులు కానివారు యీ ఔదార్యానికే తగరు; మరి (వారి ప్రస్తుతపు కోరిక మన్నించబడితే) వూరికే కూర్చుకొన్న 5 నెలలజీతం రూపంలో ముట్టె ఔదార్యానికి అసలే తగదు."



# మంత్రివర్గ తీర్మానాలు

## దేవాలయాల పరిశీలన

16-2-59 న జరిగిన మంత్రివర్గ సమావేశంలో, ఆంధ్రప్రదేశ్‌లో దేవాలయాల పరిశీలనను ముఖ్యంగా వాస్తు శాస్త్రం, శిల్పం, విగ్రహవర్ణన శాస్త్రాలకు సంబంధించిన పరిశీలనను జరుపుటకు ప్రణాళికను సిద్ధంచేయుటకై ఒక సంఘాన్ని యేర్పాటు చేయాలన్న ప్రతిపాదన ఆమోదించబడింది.



# ప్రభుత్వ ప్రచురణలు

1. ఆంధ్రప్రదేశ్‌లో ఆహారోత్పత్తి ( తె* లేక ఉ* ) 0.12 న.పై.
2. ఆంధ్రప్రదేశ్ పశు సంక్షేమం ( ఇ* లేక తె* లేక ఉ* ) 0.12 న.పై.
3. ఆంధ్రప్రదేశ్ చేతి పనులు ( తె* లేక ఉ* ) 0.12 న.పై.
4. ఆంధ్రప్రదేశ్‌లో గిరిజన సంక్షేమం ( తె* లేక ఉ* ) 0.12 న.పై.
5. ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమలు ( ఉ* ) 0.12 న.పై.
6. ఆంధ్రప్రదేశ్ మత్స్యసంపద ( ఇ* లేక తె* ఉ* ) 0.12 న.పై.
7. ఆంధ్రప్రదేశ్ స్థూల స్వరూపం (ఆంధ్రప్రదేశ్ యెట్ యెగ్లాన్సు) (ఇ*లేక తె*) 0.12 న.పై.
8. నూతన గ్రామాల నిర్మాణం ( ఇ* లేక తె* ) 0.12 న.పై
9. ఆంధ్రప్రదేశ్ – ధాన్యాగారం - ( ఇ* ) 0.12 న.పై.
10 ఆంధ్రప్రదేశ్‌లో దర్శనీయమయిన స్థలాలు (తె*) 0.12 న.పై.

*గమనిక:*—ఈ పుస్తకాలు ఖరీదు డబ్బు చేరగానే పంపబడతాయి.

షరా:- పోస్టు ఖర్చులు అదనం.

*ఇ = ఇంగ్లీషు
*తె = తెలుగు
*ఉ = ఉర్దూ

ప్రతులకై
ప్రచురణల విభాగం, సమాచార,
పౌరసంబంధాల డైరెక్టరు కార్యాలయం,
హైదరాబాదు 1.
చిరునామాకు వ్రాయండి

Statement about ownership and other particulars about newspaper (ANDHRA PRADESH) to be published in the first issue every year after the last day of February.

## FORM IV

(See Rule 8)

| | | |
|---|---|---|
| 1. | Place of Publication .. .. | Hyderabad |
| 2. | Periodicity of its Publication | Monthly. |
| 3. | Printer's Name ... ... ... | Sri S Krishna Rao, Citizen Press. |
| | Nationality . ... | Indian |
| | Address . .. . | Park Lane, Secunderabad. |
| 4. | Publisher's Name .. ... ... | Director of Information and Public Relations. |
| | Nationality . .. . | Indian |
| | Address . . . | Mukkaramjahi Road, Hyderabad-1. |
| 5 | Editor's Name . ... | Sri Narsing Rao Manvi. |
| | Nationality . ... | Indian. |
| | Address . .. | Director of Information and Public Relations, Govt. of Andhra Pradesh, Mukkaramjahi Road, Hyderabad-1. |
| 6 | Names and Addresses of individuals who own the newspapers and partners or share-holders holding more than one per cent of the total capital | * * * |

I, Sri Narsing Rao Manvi, Director of Information and Public Relations, Government of Andhra Pradesh, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief

(Sd) **Narsing Rao Manvi.**

Dated 28-3-1959

Signature of Publisher.

---

* The Director, Government Printing Press, Government of Andhra Pradesh, Hyderabad-Deccan, is the official Printer but he may name any other printer when the Government Press cannot undertake printing of this journal

# "ఆంధ్రప్రదేశ్" ప్రకటన రేట్లు



'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరుపేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శాతం రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: 10½ × 8½" డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 8వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటినెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్‌చేయబడని డిమాండు డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు—దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,
సమాచార, పౌరసంబంధముల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాదు దక్కన్ — 1.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... | 1,06,041 చదరపు మైళ్లు |
| జనసంఖ్య | ... | 3,12,60,133 |
| పురుషులు | ... | 1,57,42,912 |
| స్త్రీలు | ... | 1,55,17,221 |

**సగటు వర్షపాతం**

| | | |
|---|---|---|
| ఆంధ్ర ప్రాంతం | ... | 34.6 అంగుళాలు |
| తెలంగాణా | ... | 36.7 ,, |
| అరణ్య ప్రదేశం | ... | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | ... | 1,000 |
| పట్టణాలు | ... | 298 |
| గ్రామాలు | ... | 26,450 |
| పంటల క్రింది ప్రదేశం | ... | 2,93,81,000 ఎకరాలు |
| 1955-56 లో నీటిపారుదలను పొందిన ప్రదేశం | .... | 66.8 లక్షల యెకరాలు |
| కౌళ్ల సంఖ్య | ... | 42,42,655 |
| 1955-56 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | ... | 54.21 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | ... | 15:5 లక్షల గేలన్లు |
| రైలుమార్గాలు | ... | 2,902 మైళ్లు |
| జాతీయ రహదార్లు | ... | 1,409 ,, |
| రాష్ట్ర రహదార్లు | ... | 2,074 ,, |
| జిల్లా పెద్దరోడ్లు | ... | 2,527 ,, |
| జిల్లా ఇతరరోడ్లు | ... | 3,458 ,, |
| పాఠశాలలు | ... | 28,000 |
| కళాశాలలు | ... | 64 |
| వృత్తి విద్యా కళాశాలలు | ... | 31 |
| ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రమాణం | ... | రూ 175.37 కోట్లు |

**1958-59 బడ్జెట్టు**

| | | |
|---|---|---|
| ఆదాయం | ... | రూ 63.66 కోట్లు |
| వ్యయం | ... | ,, 62.87 ,, |
| పెట్టుబడి ఖర్చు | ... | ,, 21.29 ,, |



హైదరాబాదు జిల్లాలోని జటప్రోలు ప్రాజెక్టుస్థలం (28-2-59న రాష్ట్ర ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు).